sunday magazine

# ఆదివారం ఆంధ్రజ్యోతి

20 నవంబర్ 2016

# WHY? TRUMP!

## అతడిలోని 'అమెరికన్' గెలిచాడు




# క్లాప్.. యాక్షన్




బాలీవుడ్‌లో లేడీ డైరెక్టర్స్ అప్పుడప్పుడూ మెరుపులు మెరిపిస్తూనే ఉన్నారు. కొందరు ఒకటీ అరా సినిమాలు తీసి వెనక్కి తగ్గితే, కొందరు మాత్రం కొత్త అవకాశాలను దక్కించుకుంటూ సత్తా చాటుకుంటున్నారు. పాత తరం మహిళా దర్శకులను కాసేపు పక్కనపెడితే ప్రస్తుతం అందరి దృష్టి గౌరీషిండేపైనే ఉంది. నాలుగేళ్ల క్రితం 'ఇంగ్లీష్ వింగ్లీష్'తో అలనాటి అందాలతార శ్రీదేవిని సరికొత్తగా చూపించి అనేక అవార్డులను మూటగట్టుకున్న గౌరీ తాజాచిత్రం 'డియర్ జిందగీ'. షారుక్‌ఖాన్, అలియాభట్‌లు నటించిన ఈ సినిమా ఈనెల 25న విడుదలవుతోంది. గౌరీతో పాటు జోయా అక్తర్ (దిల్ ధడక్నే దో), ఫరాఖాన్ (హ్యాపీ న్యూ ఇయర్), రీమాకాగ్తీ (తలాష్)వంటి డాషింగ్ డైరెక్టర్లు స్టార్లతో సినిమాలు తీస్తుంటే, లీనాయాదవ్ (పార్చ్‌డ్), మేఘనా గుల్జార్(తల్వార్) , రాజశ్రీ ఊజా (అయిషా) వంటి వారు కొత్త కొత్త కథాంశాలతో సినిమాలు తీస్తున్నారు. వీరంతా తమ తదుపరి ప్రాజెక్టులను పట్టాలెక్కించే పనిలో ప్రస్తుతం బిజీగా ఉన్నారు.









## ఇండెక్స్


అవీ ఇవీ . . . . . . . . . . . . . . 4
రోడ్డు మీద 'ఫ్రైడ్ ఎగ్స్'

నా పాట . . . . . . . . . . . . . . 6
అనంత శ్రీరామ్

కథ వెనుక కథ . . . . . . . . . 14
యద్దనపూడి సులోచనారాణి

ఇంటెక్ . . . . . . . . . . . . . . 16
హెయిర్ బ్యూటీ గాడ్జెట్స్

కేరింత . . . . . . . . . . . . . . . 18
నీళ్ల రాదారి!





కవర్‌స్టోరీ . . . . . . . . . . . . . 8
అతడిలోని అమెరికన్ గెలిచాడు

క్రైమ్ కహానీ . . . . . . . . . . 20
మూడు హత్యల మిస్టరీ

ఈవారం కవిత . . . . . . . . . 23
ఆచూకీ

ఈ వారం కథ . . . . . . . . . . 26
శిశిరంలో వసంతం

కొత్త పుస్తకాలు . . . . . . . . . 30
ఆకాశమల్లి

ఫుడ్‌కోర్ట్ . . . . . . . . . . . . . 32
టేస్టీ స్టఫ్స్



# ఆదివారం ఆంధ్రజ్యోతి

20 నవంబర్ 2016


### ఆరోగ్యానికి కొత్త అడ్రస్

ఈ వారం కవర్‌స్టోరీ 'ఆపిల్ సైడర్ వెనిగర్' చాలా బాగుంది. అనేక రోగాలతో అల్లాడుతున్న ప్రజలకు ఆపిల్ సైడర్ గురించి ఇచ్చిన విషయాలు ఎంతో ఉపయోగపడతాయి. ఏసీ గదుల్లో కాళ్లు కదపకుండా పని చేసే ఉద్యోగాలను కోరుకునే వారే ఎక్కువ. ఆ కారణంగా ఊబకాయం ఓ సమస్యగా మారింది. దానికి తోడు కాలుష్యం కారణంగా ఉదర సమస్యలు, పని ఒత్తిడి కారణంగా గుండె జబ్బులు, చర్మ, శిరోజ సమస్యలతో జనం నానా ఇబ్బందులు పడుతున్నారు. వీటి నుంచి బయటపడేందుకు పడరాని పాట్లు పడుతున్నవారికి ఈ ఆపిల్ సైడర్ వెనిగర్ ఒక మంచి ఔషధం.

**- ఎ. లక్ష్మీనారాయణ,** ఖమ్మం

### సత్యాన్ని వెతుకుదాం

'అదృశ్యం' కథ ఎన్నో ఆలోచనలను రేకెత్తించింది. సత్యం అనేది ఈ కథలో ఒక పాత్ర కాదు. నిజం. అసలు గెలుపంటే ఏమిటి? లక్షల్లో వచ్చే జీతమా? హోదానా? లేక ఆత్మ సంతృప్తినిచ్చే జీవితమా? తెలుసుకోమని పరోక్షంగా ప్రతి పాఠకుడిని ఆలోచనల్లోకి తోసేశారు రచయిత. సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని చూస్తూ, భరిస్తూ ఏమీ చేయలేక, చాతకాని మనిషిలా చేతులు కట్టుకొని నిల్చోలేక, తెగించి పోరాడలేక తమలో తామే మధనపడే 'సత్యాలు' ఎందరో ఉన్నారు మన చుట్టూరా. తనవారిని సంతోషపెట్టడంలో కూడా ఓడిపోయిన వ్యక్తి మనుషుల నుంచి ఓదార్పు కోరుకోవడమూ మూర్ఖత్వమే అవుతుంది.

**- విజయ్,** చిక్కడపల్లి



ఈ వారం కథ 'అదృశ్యం'లో ప్రశ్న అనే పదం 58 సార్లు వచ్చింది. తీసుకున్న కథా వస్తువు మంచిదే అయినా తాననుకున్న విషయాన్ని ఆకర్షణీయంగా, ఆకట్టుకునే కథనంతో చెప్పడంలో విఫలమయినట్టుగా అనిపించింది. వారం వారం ఆదివారం అనుబంధంలో వచ్చే కథ కోసం ఎదురుచూస్తుంటాం. నాణ్యమైన కథలనే ఎంపిక చేసి ప్రచురిస్తారనే నమ్మకం ఉంది. అయితే ఈ వారం మీ ఎంపిక సరిగ్గా లేదు.

**- హరిప్రసాద్,** ఈమెయిల్

### కలర్‌ఫుల్ ట్రావెల్

ప్రకృతి అందాలను చూడాలనుకునేవారికి ముందుగా గుర్తొచ్చే ప్రదేశం హిమాలయాలు. మంచు కొండల్లో దాగున్న 'హిమకుండ్' గురించి, 'వ్యాలీ ఆఫ్ ఫ్లవర్స్' గురించి తెలిపిన 'ట్రావెలోకం' విశేషాలు బాగున్నాయి. ఉరుములు, మెరుపులు చూడాలంటే కిందకి చూడాలంటూ, మేఘాల పైనున్న పర్వతాల గురించి వివరించిన తీరు బాగుంది. ఎంతటి అద్భుత ప్రదేశమైనా చెత్త వేసి దాని అందాన్ని చెడగొట్టడం మన వాళ్లకు బాగా అలవాటు. అలాంటిది 'వ్యాలీ ఆఫ్ ఫ్లవర్స్'లో చెత్త వేయకుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకున్నారని తెలిసి ఆనందపడ్డాం. భూమిపైన ఏర్పడిన ఆ ఇంద్రధనస్సును వెంటనే చూడాలనిపించింది.

**- బి. శ్రీకాంత్,** జనగామ

## ఇన్‌బాక్స్

### తప్పు ఎవరిది?

అల్లారుముద్దుగా పెంచుకున్న చిన్నారి అర్థాంతరంగా దూరమైతే, ఆ తల్లిదండ్రుల బాధ వర్ణించలేనిది. ఈ వారం 'చిన్నారి హత్య' క్రైమ్ కహానీ చదువుతుంటే కళ్లల్లో నీళ్లొచ్చాయి. చదువుకోవాల్సిన వయసులో చదువబ్బక, మంచిచెడు చెప్పేవారు లేక వ్యసనాలకు బానిసైన ఒక కుర్రాడు కేవలం ఏడు వేల కోసం ఓ చిన్నారిని హత్యచేశాడని తెలిసి బాధేసింది. అతను అలా తయారవ్వడానికి కారణం ఎవరు? తప్పు ఎవరిది? చిన్నారి అరుస్తున్నా వాళ్ల అక్క నిద్రలేవక పోవడం, తర్వాత ఆమె ప్రస్తావన లేకపోవడంతో ముగింపు అసంతృప్తిగా అనిపించింది.

**- నరేందర్,** విజయనగరం

### ఎన్నో ఏళ్ల అనుబంధం

ఈ వారం కవర్‌స్టోరీ 'ఆపిల్ సైడర్ వెనిగర్' గురించి ఇచ్చిన వివరాలు అందరికీ ఎంతో ఉపయోగపడతాయి. మన చుట్టూ ఉన్న ప్రకృతే మన ఆరోగ్యానికి కావాల్సిన వస్తువులను తనలో దాచుకుంది. అది తెలియక మనం అభివృద్ధి పేరిట కాలుష్యాన్ని సృష్టించి ప్రకృతిని నాశనం చేస్తున్నాం. 78 ఏళ్ల వయసులో నేను మా మనవడి సహాయంతో ఈ ఈమెయిల్ పంపుతున్నాను.

**- గర్రె కృష్ణమూర్తి,** మచిలీపట్నం

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.

## రోడ్డు మీద

# ‘ఫ్రైడ్ ఎగ్స్’



వాహనాలతో ఎప్పుడూ బిజీగా ఉండే రోడ్డు... రోడ్డు పక్కన ఉండే ఫుట్‌పాత్‌పై ‘ఫ్రైడ్ ఎగ్స్’ సీన్... పైనుంచి చూస్తే పెనం మీద హాఫ్ బాయిల్డ్ కోడిగుడ్డు వేసినట్టుగా కనిపిస్తుంది. అయితే  అది ‘ఆర్ట్’లో ఒక భాగమని తెలిసి ఆ కళాకారుల సృజనకు హాట్సాఫ్ చెప్పకుండా ఉండలేం. దక్షిణ అమెరికాలోని చిలీ క్యాపిటల్ శాంటియాగోలో ఇటీవల ఒక ఆర్ట్ ఫెస్టివల్ జరిగింది. అక్కడ అనేకమంది కళాకారులు తమ సృజనకు పనిపెట్టారు. నగరాన్ని అద్భుతమైన శిల్పాలు, ఆర్ట్‌వర్క్‌లతో కన్నులపండువగా తీర్చిదిద్దారు. అందులో భాగంగానే ఒక ఆర్టిస్టు ఈ ‘ఫ్రైడ్ ఎగ్స్’ను రోడ్డు పక్కన సృష్టించాడు. రోడ్డు మీద వెళ్తున్నవారు సైతం అక్కడ కాసేపు ఆగి సరదాగా ‘ఫ్రైడ్ ఎగ్స్’పైకి ఎక్కి ముచ్చట తీర్చుకుంటున్నారు.




**అవీ ఇవీ**

## మైదానం కాదు సరస్సు...

పోయాంగ్ సరస్సు... నిన్నటిదాకా చైనాలో ఉన్న పెద్ద మంచినీటి సరస్సులలో ఒకటి. జూజియాంగ్ ప్రాంతంలో ఉన్న ఈ సరస్సు గత కొన్నేళ్లుగా వాతావరణంలో జరిగిన మార్పుల వల్ల కుంచించుకుపోయింది. ఈ యేడాది పూర్తిగా ఎండిపోయి ఆ ప్రాంతంలో గడ్డిపూలు మొలిచాయి. ఆ గడ్డిపూలు సైతం సందర్శకులకు ఆహ్లాదాన్ని పంచుతున్నాయి. ఇన్నాళ్లు నీటితో నిండిపోయి ఉన్న ఆ ప్రాంతం ఒక్కసారిగా పూలవనంలా మారి ఒక పిక్నిక్ స్పాట్‌ను తలపించడంతో వారాంతాల్లో చుట్టుపక్కల ప్రాంతాల నుంచి జనం అక్కడికి వెళ్లి సేదదీరుతున్నారు.








('మజ్నూ' చిత్రంలోని
'ఇది తొలిరాత్రి కదలని రాత్రి' పాటకు)

ఇది చలిరాత్రి, చలిపులి రాత్రి
నాకు నెమ్ము, నీకు దగ్గు ఎక్కువైన అర్ధరాత్రీ ..
హీలరు తేవే .. ఊపిరి లేదే .. /ఇది చలిరాత్రి/

డాక్టరమ్మా వేడి నీళ్లు తాగమన్నదీ ..
పెండలాడే కిటికీలు మూయమన్నదీ
ధూమపానం పూర్తిగా మానమన్నదీ



పేరడీ

స్వీట్లనేమో ఆశపడి మింగకన్నదీ
ఆ విక్సు కొరకు పిలుపు, నా శ్వాస కొరకు ఏడుపు
అరిచి అరిచి దగ్గి దగ్గి అలుపు వస్తున్నదీ ఆ .. ఆ ..
హీలరు తేవే .. ఊపిరి లేదే .. / ఇది చలిరాత్రి/

ఈ నెలంతా పసుపు పాలు తాగమన్నదీ
ముక్కేమో నీరు కారి బిగుసుకున్నదీ
అనునిత్యం ఆవిరే పట్టమన్నదీ
చలికాలం మంచులో తిరుగకన్నదీ
ఆ జలుబుకొరకు సిరప్పు, ఈ రొంపతోటి బతుకు
చీది చీది ముక్కువాచి కందిపోతున్నదీ ..
హీలరు తేవే .. ఊపిరి లేదే .. /ఇది చలిరాత్రి/

– త్రిశూల్ ఆనంద్, 73307 37033

## ప్చ్ .. నమ్మకమే లేదు!



**బ్యాం**కు వాళ్లు పెన్ కట్టి పెడతారు.
మందుల షాపు వాళ్లు కత్తెర కట్టి పెడతారు.
జిరాక్స్ షాపు వాళ్లు స్టేప్లర్ కట్టిపెడతారు.
చలివేంద్రాల్లో గ్లాసు కట్టి పెడతారు.
గొప్పవాళ్లు కుక్కని కట్టిపెడతారు.
కాలేజీ అమ్మాయిలు ముఖానికి రుమాలు కట్టిపెడతారు.
పెళ్లాలు మొగుళ్లని కొంగుకు కట్టిపెడతారు.
ఏవిటో .. వెధవ ప్రపంచం .. ఒకళ్ల మీద ఒకళ్లకి నమ్మకమే లేదు!

## ఔరా!



- ఆయుధం లేని పోరాటం?
  - మౌనపోరాటం!
- నారి లేని విల్లు?
  - హరివిల్లు!
- మొక్కకు పూయని రోజాలు?
  - శిరోజాలు!
- అందరూ కోరుకునే సతి?
  - వసతి!

## 'దాస'వడం ఖాయం!



దేవుణ్ని నిజాయితీగా పూజిస్తే రామదాసు అవుతాడు.
అమ్మాయిని నిజాయితీగా ప్రేమిస్తే దేవదాసు అవుతాడు.

సినీపాటకు మాస్, క్లాస్, మెలోడీ.. ఇలా ఎన్ని కోణాలున్నా.. ఆ అన్ని కోణాల్నీ మరింత పదునెక్కించే కలం ఆయనది. సినీపాటకు పౌరాణికం, జానపదం, చారిత్రకం.. ఇలా ఎన్ని జానర్లున్నా.. అన్నింటికీ జీవం పోసే జాణతనం ఆ కలానిది. పాటల 'పరిశ్రమ'లో సిరివెన్నెల వారసత్వాన్ని సగౌరవంగా తలకెత్తుకున్న అనంత శ్రీరామ్ గాయక రచయిత. మామూలు గేయ రచయితలందరూ పాట మాత్రమే రాసి ఇస్తారు. కానీ మ్యూజిక్ డైరెక్టర్ ట్యూన్ ఇస్తే దానికనుగుణంగా పాట రాసి, అది లెంగ్త్‌లో ఉందో, లేదో.. తేలిగ్గా తెలుసుకునే విధంగా పాడి రికార్డు చేసి మరీ పంపిస్తారు అనంత శ్రీరామ్. ఆయన రాసిన 'ఏం సందేహం లేదు' పాట విశేషాలు ఈవారం 'నా పాట'లో...



# ఏం సందేహం లేదు...

నా పాట...30

మొదటి నుంచి సిరివెన్నెల పాటలంటే ఇష్టం నాకు. నేను పరిశ్రమలోకి వచ్చినపుడు నా శైలి ఆయనకు దగ్గరగా ఉండటంతో అందరూ నన్ను జూనియర్ సిరివెన్నెల అని పిలిచేవాళ్లు. అయితే ఆయనను అనుకరించకుండా... కేవలం అనుసరించాలని మొదట్లోనే అనుకున్నాను. అలా అనుసరిస్తూ నేను ఇటీవల రాసిన ఒక ప్రేమ పాట 'ఊహలు గుసగుసలాడే' సినిమాలోని 'ఏం సందేహం లేదు'. కొన్ని సందర్భాలకు కొన్ని భాషల్లోని వ్యక్తీకరణలు బాగా కుదురుతాయి. అందుకే అవి బాగా ప్రచారమై ఇతర భాషల్లో కలిసిపోతుంటాయి. సందేహం, శంక అనే తెలుగు పదాలను డౌట్ అనే పదం ఎప్పుడో ఆక్రమించేసింది.

'ఎనీ డౌట్, నో డౌట్ ఎబౌట్ ఇట్' లాంటి మాటలు అందరూ విరివిగా వాడేస్తున్నారు. 'ఏం సందేహం లేదు' అనే పాట రాయాల్సి వచ్చినపుడు నాకు 'నో డౌట్ ఎబౌట్ ఇట్' అనే ఇంగ్లీషు వ్యక్తీకరణతో పనిబడింది. దానిని తెలుగులోకి తీసుకురావడం ఎలా? అని ఆలోచించి 'ఏం సందేహం లేదు' అని పాట మొదలుపెట్టాను. అసలీ పాట ఇలా మొదలుపెట్టడానికి కారణమైన నేపథ్యాన్ని ముందు మీకు వివరించాలి. కథ ప్రకారం కథానాయకుడు తన మాజీ ప్రేయసికి, ఆమె కొత్త ప్రియుడైన తన బాస్ రాసినట్టుగా తనే ఓ లేఖ రాయాలి. ఇది ఒక విచిత్రమైన సన్నివేశం. అంతేకాదు... ఈ పాటలో కథానాయికకు కొత్త ప్రియుడి భావాలు కనిపించాలి. అదే సమయంలో పాత ప్రియుడి భావాలు అలా తొంగి చూసి వెళ్లిపోయినట్టుండాలి. హీరో పరిస్థితిని ప్రతిఫలించే అతడి అంతరాత్మ కోణాన్నీ పాటలో పొందుపరచాలి. ఈ పాటలో ఇంత సంక్లిష్టత ఉన్నా... ఈ సంక్లిష్టత పాటలో కనిపించకూడదు. ఎంత కష్టమో చూడండి. ముందు కథానాయకుడు తన ప్రేమ సంగతుల్ని నెమరు వేసుకుంటూ... అవి తన బాస్ భావాలుగా లేఖపై పెట్టాలి. అందుకే నీ నవ్వుకే నేను పడిపోయాను అని మరో రకంగా చెప్పడానికి 'ఏం సందేహం లేదు... ఆ అందాల నవ్వే ఈ సందళ్లు తెచ్చింది' అని పాతరోజులు గుర్తు తెచ్చుకుంటున్నట్టు ఆ లైన్లు రాశాను. తర్వాత

**ఏం సందేహం లేదు ఆ కందేటి సిగ్గే**
**ఈ తొందర్లు ఇచ్చింది**
**ఏం సందేహం లేదు ఆ గంధాల గొంతే**
**ఆనందాలు పంచింది**

అని రాశాను. ఇక్కడ 'ఆ గంధాల గొంతు'కు భౌతికపరమైన వివరణ ఒకటి, మానసికమైన వివరణ ఒకటి ఉన్నాయి. శుభకార్యాల వేళ... ఆధ్యాత్మికతకు చిహ్నంగా స్త్రీలు మెడ మీద గంధం రాసుకుంటారు. అలా రాసుకున్నప్పుడు ఆ గొంతు చాలా అందంగా, పవిత్రంగా కనిపిస్తుంది. ప్రేమలేఖ చదువుతున్న ఆమె గొంతు కూడా అలానే అందంగా, పవిత్రంగా ఉందనేది భౌతికపరమైన వివరణ. ఇక కవితాత్మకంగా ఎలాంటి వివరణ ఇవ్వొచ్చు అంటే.. గంధం అంటే పరిమళం కదా! అంటే నీ మాటల్లోనే పరిమళం దాగి ఉందని చెప్పడం. నేనీ 'గంధాల గొంతు' ప్రయోగం చేయడా నికి బాపు గారి సినిమాల్లో కథానాయికలు నన్ను ఎక్కువగా ఆకట్టుకోవడమే. ఈ పాటకు తెలుగుదనాన్ని అద్దడానికి బాపుబొమ్మను రిఫరెన్సుగా తీసుకున్నానన్నమాట. నీలో నన్నాకర్షించిన లక్షణాలు ఇవే... అని చెప్పిన తర్వాత ఏ ప్రేమికుడైనా అలా ఉత్తినే కూర్చోడు కదండీ. అందుకే -

**నిమిషము నేల మీద నిలువని గాలి లాగ**
**మది నిను చేరుతోందె చిలకా**

గాలి సహజ లక్షణం పైకి వీచడం. అందుకే గాలిని మనసుకు సింబాలిక్‌గా తీసుకున్నాను. ఆ గాలి నీవైపే వీచడానికి ప్రయత్నిస్తున్నది... అని ప్రియుడు చెప్తున్నట్టు ఈ లైన్లు రాశాను.

**తనకొక తోడు లాగ వెనకనె సాగుతోంది**
**హృదయము రాసుకున్న లేఖా... ఆఆ..!**

ముందు నీ దగ్గరకు వచ్చేది నా లేఖ కాదు. నా మనసే ముందు నీ దగ్గరకు వచ్చేస్తుంది. దానికి తోడుగా ఆ తర్వాత లేఖ వచ్చి చేరుతుంది. కానీ లేఖ కంటే ముందే చేరుకున్న మనసు మరి నీకు అర్థమవుతుందో? లేదో! అందుకే హృదయం రాసుకున్న లేఖ... నా మనసును నీ ముందు విప్పడానికి వస్తుంది అనే భావం వచ్చేట్టు చరణం పూర్తి చేశాను.

ఆ లేఖలోని రెండో చరణం పాటలో అమ్మాయి చదువుతున్నట్టుగా వస్తుంది. రాసింది అబ్బాయి అయినా... అమ్మాయి చదువుతుంది కాబట్టి సెన్సివిటీ కనిపించాలి. అంటే అమ్మాయి చదివే సమయంలో పాటలో వచ్చే పదాలలో సున్నితత్వం పెంచాలి. సహజంగా పాటలో మొదటి చరణం ట్యూన్‌లోనే రెండో చరణం ఉంటుంది. అయితే ఇక్కడ రెండో చరణం దగ్గరకి వచ్చేసరికి సంగీత దర్శకులు కళ్యాణి మాలిక్‌గారు పాట రాయకముందే రెండో



చరణం ప్రారంభంలో నా సితార్ బిట్ల మధ్య నువ్వు పదాలు రాయాలి' అని నాకో నిబంధన పెట్టారు. అంటే 'ఏం సందేహం లేదు' అని పూర్తిగా రాసే స్థానంలో 'ఏం' అనే చోట ఆయన సితార్ బిట్ వస్తుంది. అందుకే రెండో చరణంలో '...వెన్నెల్లో ఉన్నా... వెచ్చంగా ఉంది...' అని పొడి మాటలు రాశాను. తర్వాత 'నా కళ్లల్లోకొచ్చి నీ కళ్లాపి జల్లి ఓ ముగ్గేసి వెళ్లావే' అనే లైన్లు పాటకు కేంద్రస్థానం వంటివి. ఆ లైన్లు కథానాయిక చదువుతుంది కాబట్టి.. ఆమె ఏం చేయడం వల్ల తను ప్రేమలో మునిగిపోయాడో చెప్పాలి. అంటే అమ్మాయి ఎక్కువగా చేసిన పనిని గుర్తు చేస్తే అప్పుడా అమ్మాయి వెంటనే కనెక్ట్ అవుతుంది కాబట్టి.. అలాంటి విషయాలే ప్రేమికుడు రాయాలి. ఎవరినైనా నిద్ర లేపడానికి ముఖంపై నీళ్ల జల్లడం సహజం. అది కళ్లాపి లానే ఉంటుంది. అందుకే 'నా కళల్లో నీ కళ్లాపి' అని రాశాను. కళ్లాపి చల్లి ముగ్గు వేయగానే నిద్ర ఎగిరిపోయింది. మనసంతా ఆమే నిండిపోయేసరికి మళ్లీ నిద్ర రానంది. అందుకే...


కళ్యాణి మాలిక్

**నిదురిక రాదు అన్న నిజమును మోసుకుంటు**
**మది నిను చేరుతుందె చిలకా**
**తనకొక తోడు లాగ వెనకనె సాగుతుంది**
**హృదయము రాసుకున్న లేఖా.. ఆఅ..**

అని రాశాను. ఇక మూడో చరణం తన ప్రేమను త్యాగం చేసి, బాస్ తరఫున తన మాజీ ప్రేయసికి ప్రేమలేఖ రాసిన కథానాయకుడిని ఉద్దేశించి అతడి అంతరాత్మ అడిగే ప్రశ్నల్లా ఉండాలి.


సునీత

**నీ కొమ్మల్లో గువ్వ ఆ గుమ్మంలోకెళ్లి**
**కూ అంటూంది విన్నావా**

అంటే నీ కొమ్మల మధ్య గూడు కట్టుకుని, నీ ఫలాలు తిన్న గువ్వ... పక్క గుమ్మంలో కూస్తోంది. నిజానికి ఆ శ్రావ్యత నువ్వు కదా అనుభవించాల్సింది? వేరే వాడికి ఆ శ్రావ్యత సొంతమవుతుంటే నువ్వేం చేస్తున్నావ్? అని అంతరాత్మ ప్రశ్నించినట్టుగా రాశాను.

**నీ మబ్బుల్లో జల్లు ఆ ముంగిట్లో పూలు**
**పూయిస్తే చాలన్నావా**

నీకు పరోపకారం ఎక్కువైంది. అందుకే నీ మబ్బుల్లో దాగున్న జల్లు వేరే వాళ్ల మొక్కలను చిగురింపజేస్తుంటే మిన్నకున్నావ్ అని అంతరాత్మ నిలదీస్తుంది. పరోపకార బుద్ధితోనే అలా చేస్తున్నావా? లేక నీకు నిజంగానే వైరాగ్యం వచ్చేసిందా అని అంతరాత్మ అడగడానికి -

**ఏమౌతున్నా గానీ ఏమైనా అయిపోనీ**
**ఏం ఫరవాలేదన్నావా**

అని రాశాను. ఆ లైన్ల తర్వాత కథానాయిక ఇంతకీ ఏమనుకుంటోంది. ఒకప్పుడు ఒక అబ్బాయిని ప్రేమించిన తాను ఇప్పుడు ఆ ప్రేమ కథకు ముగింపు పలకాలా? కొత్తగా వచ్చిన వ్యక్తి చేయందుకోవాలా అనే తటపటాయింపులో...

**అడుగులు వెయ్యాలేక అటు ఇటు తేల్చుకోక**
**సతమతమైన గుండె గనుక**
**అడిగిన దానికింక బదులిక పంపుతుంది**
**పదములు లేని మౌన లేఖా... ఆఅ...**

అని కథానాయిక పాడుతున్నట్టు రాశాను. అయితే ఇక్కడ లేఖ చదివినప్పుడే ఆ లేఖ రాసింది తన మాజీ ప్రియుడని కథానాయిక గుర్తు పట్టింది. అందుకే జవాబేం రాయాలో తెలియక పదములు లేని మౌన లేఖను పంపుతున్నాను అంటుంది. ఆ భావాన్ని గాయని సునీత చాలా చక్కగా పలికించారు.

ట్రయాంగులర్ లవ్‌స్టోరీలు మనకి కొత్తేం కాదు గానీ... ఆ ముగ్గురి మనసుల్నీ ఒకే పాటలో ఆవిష్కరించాల్సి రావడం మాత్రం నాకు ఇదే ప్రథమం. అయినా ఎలాంటి గందరగోళం లేకుండా ఈ పాట రాయగలిగాను. ప్రేక్షకులూ, శ్రోతలూ ఈ పాటని అంతే బాగా రిసీవ్ చేసుకున్నారు. ధన్యవాదాలు.

(మరో పాటతో వచ్చేవారం కలుద్దాం!)

**అనంత శ్రీరామ్** ananthasriramlyrics@gmail.com

- రాజేశ్వరి




# అతడిలోని అమెరికన్ గెలిచాడు

**ప్రపంచం ఒకటి తలిస్తే... అమెరికా ఇంకొకటి తలిచింది. అందుకే అందరి అంచనాలు, సర్వేలు, ఊహాగానాలను తలకిందులు చేస్తూ డోనాల్డ్ ట్రంప్ శ్వేతసౌధ విజేతగా నిలిచారు. ఏ మాత్రం రాజకీయ అనుభవం లేని ఒక 'ఔట్‌సైడర్' ఇంతటి సంచలనం సృష్టిస్తాడని ఎవరూ ఊహించలేదు. ఎన్నికల వేళ 'అడ్డగోలుగా' మాట్లాడి, అన్ని ఒపీనియన్ పోల్స్‌లో వెనకబడి ఉండి కూడా 'అధ్యక్షుడి పీఠం నాదే' అని చెప్పి మరీ గెలవడం ఆయన ప్రత్యర్థులకు ఇప్పటికీ మింగుడుపడని వాస్తవం. ఎన్నికల ప్రక్రియ మొదలైనప్పటి నుంచి చివరి రోజుదాకా కొనసాగిన హిల్లరీ క్లింటన్ హవాకు ఉన్నట్టుండి ఏమైంది? వివాదాల ట్రంప్‌కే అమెరికన్లు ఎందుకు పట్టం కట్టారు? ప్రవాస భారతీయుడు, ప్రముఖ కవి నారాయణస్వామి వెంకటయోగి అక్కడి పరిస్థితులను విశ్లేషిస్తూ అందిస్తున్న కవర్‌స్టోరీ ఇది.**

ఆ రోజు నవంబర్ 8 మంగళవారం. సాయంత్రం 5 కావస్తున్నది. అమెరికా అధ్యక్ష పదవికి ఎన్నికలు ప్రారంభమై పదకొండు గంటలైంది. దాదాపు అన్ని పోలింగ్ కేంద్రాల్లో ఓటర్ల సంఖ్య చాలా ఎక్కువగా ఉన్నట్టు, క్యూ లైన్లు చాలా పొడుగ్గా ఉండి ఓటు వెయ్యడానికి గంటలకు గంటలు సమయం పడుతున్నట్టు వార్తలు వస్తున్నయి. మరో గంటలో కొన్ని రాష్ట్రాల్లో పోలింగ్ ముగియనున్నది. కొన్ని రాష్ట్రాల్లో తొమ్మిది దాకా సమయమున్నది. అన్ని చానెళ్లూ ఎన్నికల మీద ప్రత్యేక బులెటిన్లు ప్రసారం చేస్తున్నయి. ఓటింగ్ బాగా జరుగుతున్నదని ఓటర్లు ఎక్కువ సంఖ్యలో ఓట్లు వేస్తున్నరని చెప్తున్నరు. ఫ్లోరిడాలో, నార్త్ కెరోలైనా రాష్ట్రాల్లో పోలింగ్ పెద్దఎత్తున జరుగుతుందని చెప్తున్నరు. ఇంతలో ఒక వార్త... నార్త్ కెరోలైనాకు చెందిన డుర్హాం అనే ప్రాంతంలోని ఒక పోలింగ్‌బూత్‌లో కంప్యూటర్ల సమస్య వచ్చి పోలింగ్ నిలిపి వేసినరని వార్త. చాలామంది ఓటర్లు చాలాసేపు లైన్లలో నిలబడి తిరిగి వెనుకకు వెళ్ళిపోయినరట. అక్కడ పోలింగ్ గడువు పెంచాలని డెమొక్రటిక్ పార్టీ కోర్టును ఆశ్రయించింది. పోలింగ్ ఎంతసేపు ఆగిందో అంత సమయం పొడిగించమని ఉత్తర్వునిచ్చింది కోర్టు. అయితే అప్పటికే ఓట్లు వేసేందుకు వచ్చిన వారిలో చాలామంది ఇళ్లకు వెళ్ళిపోయినరు. వారిలో ఎక్కువ మంది డెమొక్రటిక్ పార్టీ అభ్యర్థి హిల్లరీకి ఓటు వేసే వాళ్ళే. ఎందుకో అపశకునంలాగా అనిపించింది.

సాయంత్రం ఆరు దాటింది. మొదటి ఫలితం ఇండియానా రాష్ట్రం నుండి వచ్చింది. ట్రంప్ నాలుగు లక్షల పైచిలుకు మెజారిటీతో ఆ రాష్ట్రంలోని ఎలెక్టోరల్ ఓట్లను స్వాధీనం చేసుకున్నడు. అయితే అది ఊహించిందే. ఇండియానా రాష్ట్రం మొదటినుండీ రిపబ్లికన్ రాష్ట్రమే. వాళ్ళు ట్రంప్‌కు ఓటెయ్యడంలో ఆశ్చర్యం లేదు. కానీ అక్కడ ఒక చిత్రం జరిగింది. ఇండియానా రాష్ట్రంలోని వీగో అనే ఒక జిల్లా (కౌంటీ)లో, దాదాపు వందేళ్లుగా మిగతా రాష్ట్రం అంతా ఎవరికి ఓటేసినా, వాళ్ళు మాత్రం (రెండు సార్లు మినహా) గెలిచే అధ్యక్షునికే వేసినరు. ఈసారి ఆ జిల్లా వారు ట్రంప్‌కు వేసినరు. ఇది రెండో పెద్ద అపశకునం. ఏమో ఈసారి వాళ్ళు పొరబడే అవకాశముంది కదా అనుకున్నం. సమయం భారంగా నడుస్తున్నది. మెల్ల మెల్లగా మిగతా రాష్ట్రాల నుండి వార్తలొస్తున్నయి. డెమొక్రాట్లకు ఓట్లు వేసే రాష్ట్రాలు హిల్లరీకి, రిపబ్లికన్లకు ఓట్లు వేసే రాష్ట్రాలు ట్రంప్‌కు వేసినట్టు ఫలితాలొస్తున్నయి. ఐతే యుద్ధరంగ రాష్ట్రాలుగా పేర్కొన్న ఒహాయో , పెన్సిల్వేనియా, నార్త్ కెరోలైనా, ఫ్లోరిడా, విస్కాన్సిన్, మిషిగన్... వీటి ఫలితాల కోసం ఉత్కంఠగా ఎదురుచూశా. ఫ్లోరిడా ఫలితాలు గంట గంటకీ నువ్వా నేనా అన్నట్లుగా వెల్లడవుతూ చివరికి ట్రంప్ వశమైంది. తర్వాత నార్త్ కెరోలైనా కూడా ఆయనకే. ఆశలు సన్నగిల్లుతున్నాయి. ఒహాయో కూడా ట్రంప్‌కే. నీరసమావరించింది. విస్కాన్సిన్, పెన్సిల్వేనియాలు కూడా ట్రంప్ వశమైనవి. మిషిగన్ కూడా ఆయనకే. హిల్లరీ చివరి ఆశ కూడా నేలమట్టమయింది. హిల్లరీ శిబిరంలో విషాదమలుముకున్నది. ఆమె మద్దతుదార్లు ఏడ్చుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయినరు. ట్రంప్ శిబిరంలో హర్షాతిరేకాలకు అవధుల్లేవు. కేరింతలు, చప్పట్లు, నినాదాలు మిన్నంటినయి. అన్ని చానెళ్లూ ట్రంప్ విజేత అని, ఆయనకు 290 ఎలెక్టోరల్ ఓట్లు వస్తే హిల్లరీకి 228 వచ్చినయనీ, ట్రంప్

భారీ ఆధిక్యతతో గెలిచిందనీ ఆయనే అమెరికా భవిష్యత్ అధ్యక్షుడనీ ప్రకటించినయి. అమెరికాలో విజేతను ఎన్నికల కార్యాలయమో, అధికార్లో ప్రకటించరు. టీవీ చానెళ్లే ప్రకటిస్తయి. అట్లా సామూహికంగా ఐదు చానెళ్ల (సీబీఎస్, ఎన్‌బీసీ, సీఎన్ఎన్, ఫాక్స్, ఏబీసీ) ప్రకటించగానే ట్రంప్ తన గెలుపు ఉపన్యాసమివ్వడానికి వేదిక ఎక్కి తను గెలవడం గొప్ప విషయమని చెప్పి, అది తనకు ముందే తెలుసని అన్నాడు. తనను గెలిపించినందుకు అందరికీ కృతజ్ఞతలు చెప్పి తాను అందరి అధ్యక్షుడినీ, అందరి కోసం పనిచేస్తాననీ ప్రకటించిండు. హిల్లరీ ట్రంప్‌కు ఫోన్ చేసి అభినందనలు తెలిపింది. గత 18 నెలలుగా అత్యంత ఉత్కంఠభరితంగానూ, చాలావరకు జుగుప్సాకరంగానూ సాగిన అమెరికా అధ్యక్ష ఎన్నికల ప్రచారం క్లయిమాక్స్‌లో ఎవరూ ఊహించని ఫలితంతో, చాలామందికి ఇష్టం లేని ట్విస్టుతో ముగిసింది.

## సకలకళావల్లభుడు

డొనాల్డ్ జాన్ ట్రంప్ (70)... అమెరికాలోని అగ్రశ్రేణి సంపన్నులలో ('ఫోర్బ్స్' ప్రకారం అమెరికాలో 156, ప్రపంచంలో 324 ర్యాంకు) ఒకరనేది తెలిసిందే. న్యూయార్క్‌లో పుట్టిపెరిగిన ట్రంప్ తన తండ్రి ఫ్రెడ్ ట్రంప్ వారసత్వంగా అందించిన రియల్‌ఎస్టేట్ వ్యాపారానికి తన తెలివితేటలను జోడించి అనతికాలంలోనే టాప్ రియల్టర్‌గా పేరు తెచ్చుకున్నారు. ఆఫీస్ టవర్లు, హోటళ్లు, కాసినోలు, గోల్ఫ్‌కోర్సుల నిర్మాణంలో తిరుగులేని వ్యాపారవేత్తగా తనదైన ముద్రవేశారు. ట్రంప్‌లో కేవలం వ్యాపారవేత్త మాత్రమే కాదు... ఒక నటుడు, టెలివిజన్ యాంకర్ కూడా ఉన్నారు. పలు టీవీ కార్యక్రమాలకు యాంకర్‌గా వ్యవహరించడమేగాక కొన్ని హాలీవుడ్ చిత్రాల్లో (హోమ్ ఎలోన్ 2, టూ వీక్స్ నోటీస్, వాల్‌స్ట్రీట్ మొదలైనవి) కామెడీ పాత్రలను కూడా పోషించాడు. ఆయనకు ముగ్గురు భార్యలు (ఇవానా, మాపుల్స్, మెలనియా), ఐదుగురు పిల్లలున్నారు. వీరిలో మెలనియా అమెరికా మొదటి మహిళగా ట్రంప్‌తో శ్వేతసౌధంలోకి అడుగుపెట్టబోతున్నారు. ట్రంప్‌కు అనేకచోట్ల విలాసవంతమైన భవనాలున్నాయి. వాటిలో పామ్‌బీచ్‌లోని 'మర్ ఎ లాగో' 17 ఎకరాల విస్తీర్ణంలో ఉంటుంది. అది వైట్‌హౌస్‌కంటే కూడా బాగుంటుందంటారు. ఇందులో మైకెల్ జాక్సన్ వంటి ఎంతోమంది ప్రముఖులు ట్రంప్ ఆతిథ్యాన్ని స్వీకరించారు. ట్రంప్‌ను చాలామంది ప్లేబాయ్‌గా కూడా పేర్కొంటారు. అనేక అందాలపోటీలను నిర్వహించడమేగాక, 'ప్లేబాయ్' పత్రికకు మోడల్స్‌తో కలిసి పోజులు కూడా ఇచ్చారు.



### ఇంతకీ ఎన్నికల్లో ఏం జరిగింది?

అమెరికాలో కాకలు తిరిగిన ఎన్నికల విశ్లేషకులు సైతం ఈ ఫలితాలను చూసి కంగుతిన్నారు. ఎందుకిలా జరిగింది? ఎక్కడ అంచనాలు తారుమారయ్యాయి? అందర్నీ ఇప్పటికీ వేధిస్తున్న ప్రశ్నలివే. ఎప్పటిలాగే ఎన్నికల రోజున ఓటర్లు పెద్ద సంఖ్యలో ఓటు వేశారు. ఆ సంఖ్య గత ఎన్నికల్లో కన్నా ఎక్కువ ఏమీ కాదు. కానీ ఎవరు ఎక్కువగా వచ్చారు? ఎవరు రాలేదు? అనేది ముఖ్యమైంది. ఈసారి ట్రంప్‌ను సమర్థించి ఆయనకు ఓటు వేయాలనుకున్న వాళ్ళు ఎక్కువ తరలి వచ్చారు. హిల్లరీకి వేయాలనుకున్న వాళ్ళు, లేదా వేస్తారు అనుకున్నోళ్ళు ఓటింగ్‌లో ఉత్సాహంగా పాల్గొనలేదు. హిల్లరీని మనస్ఫూర్తిగా నమ్మి ఇష్టపడ్డ వాళ్ళు తక్కువయ్యారు. ట్రంప్ అప్రజాస్వామికవాది కాబట్టి, ఆయన వల్ల సమాజానికి నష్టం జరుగుతుంది కాబట్టి, ఆయన కన్నా తక్కువ ప్రమాదకారి కనక హిల్లరీకి వేయాల్సి వస్తోందన్నవాళ్ళే ఎక్కువ కనిపించారు. అంతేకాదు. మధ్య అమెరికాలో, రిపబ్లికన్ రాష్ట్రాల్లో, గ్రామీణ అమెరికాలో అన్నిటికన్నా ముఖ్యంగా 'రస్ట్ బెల్ట్' అని పిలవబడే మిషిగన్, విస్కాన్సిన్, ఒహాయో, పెన్సిల్వేనియా, ఇండియానా, వెస్ట్ వర్జీనియా, అయోవా తదితర రాష్ట్రాల్లో ట్రంప్‌కు హిల్లరీ కన్నా చాలా ఎక్కువ ఓట్లు వచ్చినయి (ఒక్క మిషిగన్‌లో తప్ప. మిషిగన్‌లో ట్రంప్ చాలా తక్కువ మార్జిన్‌తో ఆధిక్యత సాధించాడు). మిషిగన్, విస్కాన్సిన్, పెన్సిల్వేనియాలు ప్రధానంగా డెమొక్రాట్ల రాష్ట్రాలు. గత ఎన్నికల్లో ఒహాయో, పెన్సిల్వేనియా రాష్ట్రాలు ఒబామాకు ఓటు వేసినయి. అటువంటిది ఈసారి అవన్నీ ట్రంప్‌కే పెద్ద సంఖ్యలో ఓట్లు వేసి విజయానికి అవసరమైన ఎలెక్టోరల్ ఓట్ల ఆధిక్యతను తెచ్చిపెట్టాయి. ఫ్లోరిడాలో లటినోల (Latinos) ఓట్లు హిల్లరీకే పడి ఆమె ఆ రాష్ట్రం చేజిక్కించుకుంటుందన్న అంచనాలు తారుమారయ్యాయి. అలాగే అన్ని అంచనాలు తలకిందులు చేస్తూ అప్పటిదాకా డెమొక్రాట్లకు కంచుకోటలా ఉన్న విస్కాన్సిన్‌లోనూ ట్రంప్ గెలిచాడు. అమెరికా ఆటో మొబైల్ పరిశ్రమకు ఆయువుపట్టు, డెమొక్రాట్లకు కంచుకోట, ఒబామా ఇచ్చిన గ్రాంట్‌తో పునర్జీవించిన జనరల్ మోటార్స్ ఉన్న మిషిగన్ రాష్ట్రంలో కూడా ట్రంప్‌కే ఆధిక్యత వచ్చింది. చాలా స్పష్టంగా డెమొక్రాట్ల కంచుకోటలు బీటలు వారినయి. ఫలితంగా ట్రంప్ అత్యధిక మెజారిటీతో గెలిచాడు. ఆధునిక అమెరికా చరిత్రను తిరగరాసిండు.

### తారుమారైన 'పోల్స్' ...

ఎన్నికలకు ముందు మీడియా నిర్వహించిన అన్ని పోల్స్‌లో



ట్రంప్ ఫ్యామిలీ...

ఎలెక్టోరల్ ఓట్లే గణనలోకి తీసుకుంటారు కాబట్టి ట్రంపే గెలిచాడు. అది అమెరికా స్టైల్ ప్రజాస్వామ్య అపహాస్యం.


మైకెల్ జాక్సన్‌తో...

హిల్లరీకే స్పష్టమైన ఆధిక్యత కనిపించింది. ఏ ఒక్క పోల్ కూడా ఆమెకు వ్యతిరేకంగా రాలేదు. పోలింగ్‌కు కొన్ని గంటల ముందు కూడా ఆమెకు ఆధిక్యం తగ్గిందన్నవే కానీ ఓడిపోతుందని మాత్రం ఏ పోల్ జోస్యం చెప్పలేదు. అయితే పోల్ శాంపిల్స్‌లో ఓ విషయాన్ని ఎవరూ అర్థం చేసుకోలేదు. కరడు కట్టిన రిపబ్లికన్లు కూడా కొంతమంది తాము ట్రంప్‌కు ఓటేస్తామని చెప్పడానికి సిగ్గుపడ్డారు. ఎందుకంటే రిపబ్లికన్ పార్టీ వ్యవస్థీకృతమైన అధికారాన్ని ట్రంప్ వ్యతిరేకించాడు. దాంతో తన పార్టీలోనే ఆయనకు మద్దతిచ్చేవాళ్ళు తక్కువయ్యారు. పైగా ట్రంప్‌లాంటి అహంభావికి, అప్రజాస్వామికవాదికి, నియంతకు, జనాలను చీల్చే విభజనవాదికి ఓటేస్తే అంతా చిన్నచూపు చూస్తారని ఎక్కువమంది బయటకు చెప్పుకోలేదు. అందుకే మీడియా నిర్వహించిన సర్వేల్లో ఎక్కడా వీళ్ళు కనిపించలేదు. ఆయనకు ఓటు వేయమన్న వాళ్ళే ఎక్కువ ముందుకొచ్చారు. అందుకే హిల్లరీ గెలుస్తున్నట్టు అన్ని పోల్స్ ప్రకటించినయి. చాప కింద నీరు లాగా ట్రంప్ మద్దతుదార్లు అమెరికా మొత్తం పాకిపోయినారు. ఇవాళ ఎన్నికలయినంక ఒక్కొక్కరే బయటికొచ్చి తాము ట్రంప్‌కు ఎందుకు వేసినారో చెప్తున్నారు. అందులో ఒక్క తెల్లవాళ్ళు మాత్రమే లేరు. లతినోలున్నారు. నల్లవాళ్ళున్నారు. స్త్రీలున్నారు. అన్నింటికన్నా ఆశ్చర్యంగా ముస్లింలున్నారు. ఐనా ట్రంప్‌కు అమెరికాలో పోలైన మొత్తం ఓట్లలో హిల్లరీ కన్నా తక్కువే వచ్చినయి. దీన్ని పాపులర్ ఓట్ అంటారు. కానీ రాష్ట్రాల వారీగా జరిగిన లెక్కింపులో ప్రతి రాష్ట్రానికి కేటాయించబడిన ఎలెక్టోరల్ ఓట్లలో మాత్రం ట్రంప్ మంచి ఆధిక్యత సాధించాడు. ఎన్నికల ఫలితానికి


'ప్లేబాయ్' ట్రంప్

## ట్రంప్‌లో నచ్చిందేమిటి?

ట్రంప్ ఒక వ్యాపారవేత్త. రాజకీయ నాయకుడు కాదు. ఆయనకు రాజకీయ భాష తెలియదు. అట్లా మాట్లాడలేదు. నోటికి ఏదొస్తే అది మాట్లాడిండు. తన మాటలు ఎవరినైనా గాయపరిచాయా, ఎవరికైనా ఇబ్బంది కలిగించాయా లేదా అని ఆయన ఆలోచించలేదు. చిత్తం వచ్చినట్టు మాట్లాడిండు. ఇప్పటిదాకా రాజకీయ నాయకులు బహిరంగ వేదిక మీదనో, సభల్లోనో మాట్లాడడానికి జంకిన, లేదా నిరాకరించిన విషయాలను ఆయన జంకు గొంకు లేకుండా మాట్లాడిండు. ఉదాహరణకు అమెరికాలో ఎక్కువ శాతం తెల్లవాళ్ళకు మెక్సికో నుండి అక్రమంగా వలస వచ్చే వారి పట్ల ద్వేషముంటుంది. వారితో అన్ని పనులూ అతి చవకగా చేయించుకుని కొన్ని సార్లు డబ్బులు ఎగ్గొట్టినా, వారిని తాము ఎన్నడూ చేయని అతి హీనమైన పనులకు వినియోగించుకుని తమ పబ్బం గడుపుకున్నా, తమ నగరాలు ఇండ్లు వాడలు వారితో శుభ్రం చేయించుకున్నా, వారికి అమెరికా పౌరసత్వం ఇవ్వడం, వారిని తమతో సమానంగా చూడడం తెల్ల అమెరికన్లకు సుతరామూ ఇష్టం ఉండదు. లోలోపల వారిని ద్వేషిస్తారు. కానీ బయటకు చెప్పరు. తమను రేసిస్టులని అంటారని బెరుకు. అటువంటి వారందరి తరఫున, మెక్సికో నుండి వచ్చే వాళ్ళను రేపిస్టులని, దొంగలని బహిరంగంగా ప్రకటించి ట్రంప్ వాళ్ళ దృష్టిలో హీరో అయ్యాడు. అలాగే అమెరికాను వణికిస్తున్న టెరరిస్టు భూతానికి ముస్లింలే కారణమని అనుకునే వాళ్ళు చాలామంది ఉన్నా బయటకు అనలేరు. ముస్లింలను రానివ్వద్దని బహిరంగంగా అనలేరు. అంటే వాళ్ళు వేసుకున్న ముసుగులు పటాపంచలౌతాయి. ఐతే ట్రంప్ బహిరంగంగా ఆ మాటన్నాడు. చైనాతో వ్యాపారాన్ని బహిరంగంగా వ్యతిరేకించగలిగే రాజకీయ నాయకులు అటు డెమొక్రాట్లలోగానీ ఇటు రిపబ్లికన్లలోగానీ లేరు. అలా వ్యతిరేకిస్తే ఎక్కడ వాల్ స్ట్రీట్ బడా కంపెనీలు, బడా వ్యాపారవేత్తలు తమకు మద్దతివ్వరో అని భయం. వాళ్ళు మద్దతు ఇవ్వక పోతే వీళ్ళకు మనుగడ లేదు. కానీ ట్రంప్‌కు వాళ్ళ మద్దతు అవసరం లేదు. అందుకే బహిరంగంగా విమర్శించాడు. అన్ని వ్యాపార ఒప్పందాలు రద్దు చేస్తా, అమెరికాకు ఉపయోగపడేలా తిరగ రాస్తా అన్నాడు. అది చేస్తాడా? చెయ్యడా? చెయ్యగలడా? అనేది వేరే విషయం. అనడం ముఖ్యం. అట్లా అనడం అమెరికన్లకు బాగా నచ్చింది. ట్రంప్‌లోని 'రాజకీయంగా సరిగా ఉండాల్సిన అవసరం లేదనే లక్షణం నచ్చింది.

## కార్మికుల దన్ను...

ట్రంప్ రాజకీయాలకు కొత్త. నిజానికి ఆ వ్యవస్థకే కొత్త. హిల్లరీ లాగా రాజకీయ అనుభవం లేదు. దాన్ని చాలామంది ఆయనకున్న పాజిటివ్ లక్షణంగా చూశారు. రాజకీయ వ్యవస్థ పట్ల తమకున్న కోపానికి, అసంతృప్తికి ట్రంప్‌లో ఒక వ్యక్తీకరణను చూశారు. తమలో అంతర్లీనంగా ఉన్న క్రోధానికి ట్రంప్ ఒక మార్గం చూపినట్టు భావించారు. ముఖ్యంగా అమెరికన్ కార్మిక వర్గం



ప్రపంచీకరణ ప్రారంభమైనప్పటినుండి తీవ్రంగా నష్టపోయింది. మంచి ఉద్యోగాలు పోయినాయి. చిల్లర మల్లర ఉద్యోగాలు దొరికినాయి. చాలీ చాలని జీతాలు, పెరిగిన ఖర్చులు, విపరీతంగా పెరిగిన ఆరోగ్య బీమా ఖర్చులు... ఇవన్నీ అమెరికా కార్మిక వర్గాన్ని, గ్రామీణ అమెరికాను 25 యేండ్లుగా అతలాకుతలం చేసినయి. 16 యేండ్లపాటు అధికారంలో ఉన్న డెమొక్రాట్ పార్టీ వాటికి పరిష్కారం చేయలేకపోయింది. ఏవో కొన్ని సంక్షేమ పథకాలు అమలు చెయ్యడం తప్ప మౌలికమైన మార్పు ఏదీ తీసుకురాలేకపోయింది. నిజానికి డెమొక్రాట్ అధ్యక్షుడు క్లింటన్ కాలంలోనే ప్రపంచీకరణ బాగా బలపడింది. అనేక వ్యాపార ఒప్పందాలు జరిగినాయి. వాటివల్లనే అమెరికా కార్మిక వర్గం పూర్తిగా నష్టపోయింది. ఎప్పుడూ డెమొక్రాట్లనే సమర్థించే కార్మికవర్గం వారి పాలనలోనే అత్యధికంగా ఉద్యోగాలు కోల్పోయి రోడ్డున పడింది.

అప్పటిదాకా ఫ్యాక్టరీలలో ఏదో ఒక ఉద్యోగం చేస్తూ ఒక మోస్తరు మంచి జీవితం అనుభవిస్తున్న కార్మికులు ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లలో గంటకు అతి తక్కువ జీతంతో పనిచేసి ఇల్లు గడపాల్సిన దారుణమైన పరిస్థితి దాపురించింది. ఆరోగ్య బీమా లేక అల్లాడిపోయినారు. వాళ్ళకు సంక్షేమ పథకాల కన్నా సరైన ఉపాధి కావాలి. అది డెమొక్రాట్లు ఇవ్వలేక పోయినారు. బుష్ ఎనిమిదేండ్ల పాలనలో యుద్ధాల్లో తలమునకలైనడు కానీ కార్మికులను పట్టించుకోలేదు. ఒబామా ఆరోగ్య బీమా తెచ్చిండు కానీ దానికి చెల్లించడానికి వాళ్ళ దగ్గర సరిపడా ఆదాయం లేదు. కార్మిక వర్గ పక్షపాతులుగా పేరున్న డెమొక్రాట్లు చివరికి క్రమక్రమంగా వారికి దూరమైనరు. కార్మికులను పట్టించుకోవాల్సిన వామపక్షవాదులు, లిబరల్స్, ప్రజాస్వామికవాదులు వారిని పూర్తిగా నిర్లక్ష్యం చేసినారు. డెమొక్రాట్లు, వామపక్షవాదులు, లిబరల్స్, యూనివర్శిటీలకు, నగరాలకు, సబర్బన్ ప్రాంతాలకు పరిమితమై గే లెస్బియన్ ట్రాన్స్‌జెండర్ హక్కులనీ మైనారిటీ హక్కులనీ సమూహాల హక్కులనీ అస్తిత్వ సిద్ధాంత చర్చలకూ అటువంటి భాషా నిర్మాణానికీ పరిమితమయ్యారు. అవి తక్కువని కాదు. వాటిని కించపరచడమూ కాదు కానీ అసలు కేంద్రీకరించాల్సింది కార్మికవర్గం మీద. ఆ పునాది వర్గానికి దూరమై కేవలం అంచులకే పరిమితమైనరు. యూనియన్లు బలహీనమైనవి. విచ్ఛిన్నమైనవి. ఫలితంగా వామపక్షాన్ని అక్కున చేర్చుకుని హత్తుకోవాల్సిన కార్మిక వర్గం క్రమంగా కుడి వైపుకి వెళ్లిపోయింది. రైట్ వింగ్ భావజాలానికి దగ్గరైంది. నిజానికి డెమొక్రాట్లకు కార్మిక వర్గం పట్ల చిత్తశుద్ధి లేదు. ఎప్పుడూ బడా పెట్టుబడి దార్లను, వాల్ స్ట్రీట్‌ను, వ్యాపారవేత్తలను సంతృప్తిపరచడమే పనిగా పెట్టుకున్నరు. ఒబామా లాంటివాడు అప్పుడప్పుడు ఏదైనా చెయ్యడానికి ప్రయత్నిస్తే దాన్ని కూడా రిపబ్లికన్లు అడ్డుకున్నారు.

ట్రంప్ సరిగ్గా అటువంటి కార్మికవర్గాన్ని తన భాష ద్వారా విపరీతంగా ఆకర్షించిండు. 'వ్యాపార ఒప్పందాలు రద్దు చేస్తాను, ఉత్పత్తి ఉద్యోగాలు మళ్ళీ చైనా నుండి అమెరికాకు తీసుకొస్తాను, మీకు పూర్వ వైభవం తెప్పిస్తాను' అన్నాడు. ఆయన మాటల్లోని నిజానిజాలు గ్రహించే విచక్షణ లేదు అమెరికా కార్మిక వర్గానికి. ఆ మాటలే వారికి సంగీతంలా వినబడ్డాయి. ఆయన చేస్తడా లేడా అని కూడా ఆలోచించలేదు. విధ్వంసమైన తమ బతుకులు బాగుపడాలని ఆశపడ్డారు.

### కొన్ని విషయాల్లో హిల్లరీ తీరు నచ్చలేదు...

ఇక హిల్లరీ విషయానికొస్తే ఆమె ఒక లోపలి వ్యక్తి. గత 30 యేండ్లలో ఆమె ఏమీ చేయలేదు. పైగా అబద్దాలు చెప్పిన 'అప'ఖ్యాతి ఉన్నది. నమ్మకస్తురాలు కాదు. అన్నింటికన్నా ముఖ్యం ఆమె ఒబామా పాలనను విమర్శించడం లేదు. ఉన్న పరిస్థితిని మారుస్తను అనడం లేదు. 'స్టేటస్‌కో'ను కొనసాగించి తప్పులను సరిదిద్దుతా అంటున్నది. అది చాలామంది అమెరికన్లకు నచ్చలేదు. రాజకీయాలకు కొత్త అయినా వ్యవస్థను ఎదిరించి మార్చేస్తా అంటున్న ట్రంప్‌లో ఒక మార్పు ఏజెంటు కనబడుతున్నాడు. ఆయన చెప్తున్న మిగతా విషయాలు కానీ, ఆయన రేసిస్టు నినాదాలు కానీ, ఆయన చెడు లక్షణాలు కానీ, ఆయన అప్రజాస్వామిక పోకడలు కానీ వారికి కనబడలేదు. అవన్నీ వ్యవస్థ మారుస్తా అంటున్న ఆయన మాటల ముందు చాలా చిన్నవై పోయినయి. పైగా ఎనిమిదేళ్ళ డెమొక్రాట్ల పాలన తర్వాత మళ్ళా ఒక డెమొక్రాట్‌ను ఎన్నుకోవడం వారికి సుతరామూ నచ్చలేదు. ఫలితంగా అత్యంత ప్రగతిశీలంగా ఉండాల్సిన కార్మిక వర్గం, ఒక ప్రమాదకారియైన నియంత లక్షణాలున్న ట్రంప్‌ను ఆలింగనం చేసుకున్నది. ఆధునిక చరిత్రలో ఒక విషాద అధ్యాయానికి తెర తీసింది. ఇది స్పష్టంగా ప్రజాస్వామిక వాదులు, లిబరల్స్, డెమొక్రాట్ల వైఫల్యమే.

swamyv@gmail.com

## ట్రంప్‌తో మన సంబంధాలు...

డొనాల్డ్ ట్రంప్ అధ్యక్షుడు కావడం వల్ల భారతదేశానికి చాలా మేలు జరుగుతుందని 'హిందూ రైట్ వింగ్'కు చెందిన వాళ్ళు అటు ఇండియాలోనూ ఇటు అమెరికాలోనూ జేజేలు పలుకుతున్నారు. ఆయన ముస్లిం వ్యతిరేకత హిందువులకు మేలు కలిగిస్తుందని అసత్య ప్రచారం చేస్తున్నారు. కొందరు దాన్ని అమాయకంగా నమ్ముతున్నారు కూడా. కానీ ముస్లిం వ్యతిరేకత వల్ల ట్రంప్ భారతదేశానికి దగ్గరవుతాడనుకోవడం అమాయకత్వమే. అమెరికా మొదట్నుంచీ దక్షిణాసియాలో పాకిస్తాన్‌కు భారతదేశానికి మధ్య శత్రుత్వాన్నే రెచ్చగొడుతున్నది. ఒకరికి వ్యతిరేకంగా మరొకరిని రెచ్చగొట్టి ఇద్దరి మధ్యా ద్వేషపూరిత వాతావరణం ఎప్పుడూ రగులుతుండేటట్లు చూడడమే అమెరికా కుటిల దౌత్యనీతి. ట్రంప్ దీనికి భిన్నంగా ప్రవర్తిస్తాడనుకోవడం గొర్రె కసాయిని నమ్మడం లాంటిదే. పైగా తను చాలాసార్లు అమెరికా ఉద్యోగాలు అమెరికా వాళ్ళకే అన్నాడు కాబట్టి భారతదేశానికి హెచ్ 1 వీసాలు, విద్యార్థి వీసాలు మరింత తగ్గించే అవకాశం ఉంది. అమెరికాలో గ్రీన్‌కార్డు కోసం పడిగాపులు పడుతున్న భారతీయులను ఇంటికి పంపే ఏర్పాట్లు కూడా చేస్తుండవచ్చు.


హిల్లరీతో...






# 'సాయి' అభయారణ్యం

'ఆ రోజు నదిలోని పెద్ద బండరాళ్లపై కూర్చుని ఉన్నాం నేనూ, నా భార్యా. మాకు కొద్ది అడుగుల దూరంలో ఎండకు తళతళ మెరుస్తున్న నీటిలోంచి ఒక్కసారిగా పైకిలేచి మావంక చూసింది ఆటర్ అని మనం పిలిచే నీటి పిల్లి. నిర్మానుష్యమైన ఆ ప్రాంతంలో అది మా ఉనికిని నమ్మలేకపోయినట్టుంది. తన చిట్టి చిట్టి పంజాలతో కళ్లు నులుముకుని చూసింది. మేం దానివంకే చూస్తూ కూర్చున్నాం. మొదట్లో అది మావంక భయం భయంగా చూసింది. ఎందుకంటే బొచ్చు కోసం మనుషులు తమ జాతిని అంతరించిపోయే దశకు తీసుకెళ్లిపోయారని బహుశా దానికి తెలుసేమో! కానీ మేం ఎలాంటి కదలిక లేకుండా, దానివంక ప్రేమగా, నవ్వుతూ చూస్తుండేసరికి అది నీటిలో మునిగి... మళ్లీ పైకి రెండు కాళ్లపై లేచి మరోసారి మా వంక తేరిపార చూసింది. తర్వాత నీటిలోపలికి వెళ్లిపోయింది. కానీ కాసేపటికే అది తన స్నేహితురాలిని తీసుకుని మా దగ్గరకు వచ్చింది. మమ్మల్ని చూపించాక తన స్నేహితురాలి వైపు తిరిగి 'నేను చెప్తే నువ్వు నమ్మలేదు కానీ చూశావా మనుషులు మనవంక ఎంత ప్రేమగా చూస్తున్నారో!' అన్నట్టు చూసింది. తర్వాత రెండూ మాకు దగ్గరలోనే నీటిలో ఆటలు ప్రారంభించాయి. కాసేపటికి ఎక్కడికో వెళ్లిపోయాయి. మొదటినుంచీ ప్రకృతి అంటే ఇష్టపడే మాకు ఈ సంఘటన... శాంక్చురీ నడపడానికి మరింత ఉత్తేజాన్నిచ్చింది' ఈ మాటలు ఇండియాలో తొలి ప్రైవేట్ వైల్డ్‌లైఫ్ శాంక్చురీ (సాయి-Saving Animals Initiative)ని నెలకొల్పిన అనిల్ కె. మల్హోత్రావి.



అనిల్ అమెరికాలో చదువుకున్న భారతీయుడు. చదువయ్యాక అక్కడే రియల్ఎస్టేట్, రెస్టారెంట్ వ్యాపారాలు చేశారు. 1960లో తొలిసారి పమేలాని కలుసుకున్నారు. ఇద్దరికీ ప్రకృతంటే ఇష్టం. అదే వారిద్దరినీ ఒకరినొకరు ఇష్టపడేట్లు చేసింది. 1986లో అనిల్ తండ్రి చనిపోయినపుడు వాళ్లిద్దరూ ఇండియా వచ్చారు. అప్పుడే హరిద్వార్‌లోని కాలుష్యాన్ని, అడవులు అంతరించిపోవడాన్ని చూశారు. కాలుష్యం కబళిస్తున్నా అందరూ నిర్లక్ష్యంగా వ్యవహరించడాన్ని చూసి ఆ జంట ఆవేదన చెందింది. అమెరికా నుంచి శాశ్వతంగా వచ్చేసి ఓ అభయారణ్యాన్ని సృష్టించాలనే ఆలోచన అప్పుడే వారిలో అంకురించింది. కర్ణాటకలోని కొడగు జిల్లాలో ఓ రైతు దగ్గర మొదట 55 ఎకరాల బంజరు భూమిని కొన్నారు. కాలక్రమంలో అనేక వ్యయప్రయాసలకోర్చి చుట్టుపక్కల భూముల్ని కూడా కొన్నారు అనిల్ దంపతులు. ఈ క్రమంలో వీరి నిబద్ధతకు మెచ్చి మరో పర్యావరణ ప్రేమికురాలు తారా చంద ర్ వీళ్లతో చేయి కలిపారు. తర్వాత మరికొంతమంది తోడయ్యారు.

ఒకసారి భూమిని సేకరించడం పూర్తయిన తర్వాత మల్హోత్రా బృందం స్థానికంగా పెరిగే వృక్షజాతుల వివరాలు తెలుసుకుని ఆ మొక్కలను నాటారు. క్రమక్రమంగా అడవి 300 ఎకరాలకు విస్తరించింది. ప్రస్తుతం ఈ వైల్డ్‌లైఫ్ శాంక్చురీలో... ఆసియాలోనే అరుదైన వనమూలికలు, విభిన్న వృక్షజాతులు, అనేక రకాలజంతువులు, పక్షులు ఉన్నాయి. 700 సంవత్సరాల చెట్టు అన్నింట్లోకి ప్రత్యేకమైనది. ఇప్పటికీ ఆ చెట్టు ఎన్నో రకాల పక్షులకు ఆశ్రయమిస్తోంది. ఈ వర్షారణ్యంలో ప్యారడైజ్ ఫ్లైక్యాచర్ వంటి దాదాపు 300 రకాల పక్షులు, పునుగు పిల్లులు, పెద్ద మలబార్ ఉడుత, లోరిస్‌లు, పులులు, ఏనుగులు, నక్కలు, చిరుతలు, జింకలు, కింగ్ కోబ్రా సహా ఎన్నో రకాల పాములు... వాటితో పాటు వందలాది ఇతర జీవ రాశులున్నాయి.



అభయారణ్యాన్ని నిర్వహించడం ప్రభుత్వాలకే కష్టసాధ్యమైన విషయం. అలాంటిది వీళ్లలా చేస్తున్నారంటే 'సాయి' పేరు మీద ఓ ట్రస్టు నెలకొల్పి విరాళాలు సేకరించడంతో పాటు అభయారణ్యంలోనే రెండు ఎకో ఫ్రెండ్లీ కాటేజ్‌లను నిర్మించారు. సోలార్ ప్యానల్స్ ద్వారా ఈ కాటేజ్‌లకు విద్యుత్ అందుతుంది. రెండు కాటేజీలలో కలిపి 16మంది వరకూ ఆతిథ్యం పొందవచ్చు. నిజానికి పర్యాటకుల తాకిడి అంతకన్నా ఎక్కువగానే ఉంది. వారికి స్థానికుల ఇళ్లల్లో వసతి కల్పిస్తున్నారు. 'అదనంగా కాటేజీలను నిర్మించే ఆలోచనలో లేము. కారణం మనుషులు పెరిగేకొద్దీ వారి అవసరాల కోసం మళ్లీ ప్రకృతిని పాడు చేయాలి. అది మాకెంత మాత్రం ఇష్టం లేదు' అన్నారు పమేలా. ఇక్కడ సఫారీ కోసం ప్రత్యేకంగా వాహనాలుండవు. ఎంతదూరమైనా కాలి నడకనే వెళ్లాలి. 'సఫారీలో వాహనాలు లేకుండా చేయడానికి కారణం, పర్యాటకులు ప్రకృతిలోని ప్రతి అంశాన్నీ ఆస్వాదించాలనీ.. చిన్న పువ్వుల్నీ, అరుదైన మూలికల తీగల్నీ చూడాలంటే నడకను మించిందేముంది?' అని ప్రశ్నిస్తారు అనిల్. కానీ అడవిలో అలా ప్రమాదం కదా? అనుకోనక్కర్లేదు. అడవిలో ప్రతి అంగుళం తెలిసిన మల్హోత్రాలు స్వయంగా గైడ్‌లుగా వ్యవహరిస్తూ క్షేమంగా సఫారీలో తిప్పి తీసుకొస్తారు. ■



# నా ఇష్టం




యాక్సిడెంట్ జోన్


మీరు మీ బైబిల్ ఇవ్వండి.
నేను మా గీతనిస్తా చదువుకుందాం!


నా కోసం నీ ఇష్టాలు చంపుకోవటం ఎందుకు?
వెళ్లి సీరియల్ చూసుకో. హోంవర్కు
రేపైనా చేసుకోవచ్చు!


సండే త్వరగా లేచి చావరే...
చికెన్ ఎప్పుడు తేవాలి? ఎప్పుడు
వండి చావాలి?


పేర్లు బాగా గుర్తుంటాయని పెద్దోడి పేరు
టాటా అని, బుడ్డోడి పేరు డొకొమొ అని.
ఈ చిట్టిదాని పేరు జియో అని
పెట్టుకున్నాం!

**యద్దనపూడి సులోచనారాణి - పరిచయం అక్కర్లేని నవలారాణి. 60వ దశకంనుండి అనంతవాహినిలా రచనలు చేస్తూ లక్షలాది పాఠకుల మనసు చూరగొన్న ప్రఖ్యాత రచయిత్రి. ప్రతి రచయితకీ ఒక ఆరంభం ఉన్నట్టే ఆమెకూ ఒక ఆరంభం ఉంది. తన పిన్న వయసులోనే దూరమైన అమ్మ జ్ఞాపకాల నుండి ఉపశమనం కోసం ఆమె రాసుకున్న తొలి కథ 'చిత్రనళినీయం'. ఆ కథను పత్రికకు పంపడంలో ఆమె ఎదుర్కొన్న సాధక బాధకాలు, కథ అచ్చయ్యాక ఇంట్లో వారందరికీ సెలబ్రిటీగా మారిపోయిన వైనం .. అదంతా 'కథ వెనక కథ'గా ఎంతో ఆసక్తికరంగా తన ఫేస్‌బుక్‌లో రాసుకున్నారు ఆమె. దాన్ని సులోచనారాణి అభిమానుల ముందుంచే ప్రయత్నమే ఇది.**

# చిత్రనళినీయం... కథ వెనక కథ

**యద్దనపూడి సులోచనారాణి**



'చిత్రనళినీయం' కథ రాసి పోస్ట్ చేయడం వెనక ఒక చిన్న కథ ఉంది. నేను ఆ కథను ఎస్.ఎస్.ఎల్.సి. పాస్ అయిన తర్వాత సెలవుల్లో రాశాను. అంతక్రితం నేను 'గోమాత' మీద ఒక వ్యాసం రాసి, క్లాస్‌లో ఫస్ట్ ప్రైజ్ తెచ్చుకున్నాను. నేను అది బాగా రాశానని ఖుద్దూస్ మాస్టార్ క్లాస్‌లో మిగతా పిల్లలచేత చప్పట్లు కొట్టించడమే కాదు వారితో కలిపి ఆయన కూడా కొట్టారు. నా మనసు పరవశించి పోయింది. ఖుద్దూస్ మాస్టార్ ముస్లిం అయినా తెలుగు బాగా మాట్లాడేవారు. రాసేవారు. చక్కగా కథలు చెప్పి నీతి బోధించేవారు. ఆయనంటే నాకు బాగా ఇష్టం.

ఇది రాసిన తర్వాత ఖుద్దూస్ మాస్టార్ స్కూల్ నుంచి వచ్చే రాత పత్రికకి కథ రాయమని అడిగారు. నాకు రాదు అంటే .. 'నువ్వు రాయగలవం'టూ ప్రోత్సహించారు. ఆ ప్రోత్సాహంతో తొలి కథ రాశాను. దాని పేరు 'మనోఛాయలు' (ఇద్దరు స్కూల్లో చదివే స్నేహితురాళ్ల మధ్య చిన్న మనస్పర్థలు వచ్చి మళ్లీ ఇద్దరూ కలిసిపోయి ఆనందంగా ఒకరి భుజం మీద మరొకరు చేతులేస్కొని స్నేహంగా స్కూల్‌కి వెళ్లటం). అది నా 14వ సంవత్సరంలో రాసిన కథ. అది కూడా ఖుద్దూస్ మాస్టార్ మరీ మరీ రాయమని అడిగితే రాసిన కథే.

ఆ తర్వాత కొన్నాళ్లకు -

ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలు అయిపోయిన సంవత్సరమది. వేసవి సెలవుల తర్వాత నవంబర్‌లో అమ్మ పోయింది. మనసులో భయం. ఒంటరి తనం, దిగులు. దుఃఖం.

అప్పటికే పెళ్లై రెండు సంవత్సరాలు అయింది. నాన్న ఎస్.ఎస్.ఎల్.సి. అయి, ఇంటర్ అయిన తర్వాతే కాపురానికి పంపిస్తానని పెళ్లికి ముందే షరతు పెట్టారు. ఇంటినిండా అక్కయ్యలు, ఒదినలు, పిల్లలు. అయినా ఒంటరితనం. అమ్మలేని దిగులు. ఖుద్దూస్ మాస్టార్ ఒకసారి నాన్నని చూడటానికి వచ్చి నన్ను కథలు రాయమని, కథలు రాస్తే నా బాధలు పోతాయని గట్టిగా చెప్పారు.

అప్పుడు 'చిత్రనళినీయం' రాశాను. కథ రాయటం అయిపోయింది. కాని, పోస్ట్ చేయటమే సమస్య ఐపోయింది. ఎలా పంపాలో తెలియదు. నాకు అక్క కొడుకులు ఉన్నారు. ఒకడు సత్యం. ఒకడు రాముడు. ఒకడు శర్మ. నాకన్నా 6 సంవత్సరాలు చిన్నవాళ్లు. వాళ్లు కూడా మా స్కూల్లోనే చదివేవారు. మా ఇంట్లో నేను ఆఖరి సంతానం. వాళ్లు తమ్ముళ్లలా ఉండేవాళ్లు. సత్యం, రాముడు కలిసి ఖుద్దూస్ మాస్టార్ దగ్గరికి వెళ్లి 'పిన్ని కథ రాసింది. ఎవరికి పంపాలి? ఎలా పంపాలి' అని అడిగి వచ్చారు. ఇదంతా ఇంట్లో వాళ్లకి తెలియకుండా రహస్యంగా జరిగింది. ఆయన కాగితం మీద ఆంధ్రపత్రిక అడ్రస్ రాసిచ్చి కవర్ మీద దాన్ని ఎలా రాయాలో చెప్పి, తిరిగి రావటానికి ఫ్రం అడ్రస్ రాయమని కూడా చెప్పి పంపారు. కథ ట్యాగ్‌తో పేజీలు కట్టి, కవర్లో పెట్టి మాస్టార్ చెప్పినట్టు అడ్రస్ రాశాను. నా అక్షరాలు చాలా అందంగా ఉంటాయని మాస్టార్‌గారు ఎప్పుడూ మెచ్చుకునేవారు.

సత్యం, రాముడు పోస్టాఫీసుకి వెళ్లి తూయించి నీరసంగా తిరిగి వచ్చారు. కవరు బరువుగా ఉంది! చాలా ఖరీదు! అర్ధ రూపాయి!! అప్పుడు కానీలు, చిల్లు కానీలు, అర్ధణా, అణా, బేడలు, పావలాలు, అర్ధరూపాయి ఉండేవి. నా దగ్గర అర్ధరూపాయి ఉండే అవకాశమే లేదు. మా నాన్నని అడిగితే వెంటనే ఇస్తారు. కానీ, నాకు అస్సలు ఇష్టం లేదు. కథ తిరిగివస్తే, నాన్న కష్టార్జితంలో అర్ధ రూపాయి వృథా అయిపోతుంది. పైన డాబా మీదకి వెళ్లే మెట్ల మీద నేను, సత్యం, రాముడు కూర్చుని ఈ కవరు పంపటం ఎలాగ అని గుడగుడలాడేవాళ్లం. మా మూడో అక్క కూతురు సుగుణ ఎప్పుడూ మా ముగ్గురిమీద ఒక కన్నేసి ఉంచేది. మేము దానిని కలుపుకోకుండా ఏదో చేసేస్తున్నామని దాని అనుమానం. ఒక్కోసారి వాళ్లమ్మ జయ అక్కయ్య వచ్చి మమ్మల్ని 'ఏం చేస్తున్నారు మీరు?' అని గద్దించేది. మేం ముగ్గురం మాట్లాడేవాళ్లం కాదు. చివరికి సత్యం ఒక సలహా చెప్పాడు.

మా రెండో అక్కయ్య పేరు రంగమ్మ. ఆవిడకి నలుగురు పిల్లలు. పిల్లలు పుట్టిన తర్వాత పాపం ఆమె రెండు కళ్లూ పోయాయి. ఆవిడ భయంకరమైన పుస్తకాల పురుగు. రాత్రివేళ నాచేత ఆంధ్రపత్రికలో సీరియల్స్ (రెండు మహానగరాలు, హకిల్‌బెర్రి ఫిన్) నూ, లైబ్రరీ నుంచి తెప్పించుకున్న శరత్‌బాబు నవలలనూ చదివించుకునేది. నాది చాలా జాలి గుండె. ఆవిడ కోసం శ్రమ పడి చదివేదాన్ని. సత్యం రంగం అక్కయ్యని అప్పు అడుగుదామని సలహా ఇచ్చాడు. మొదట నేను ఒప్పుకోలేదు. భయపడ్డాను. అప్పంటే చాలా చెడ్డ భయం నాకు.

వారం రోజుల క్రితమే మా నాన్న చిన్నన్నయ్య బుట్టల సుబ్బమ్మ దగ్గర అర్ధణా పెట్టి బటాణీలు తిన్నాడని తెలిసి చితకబాదాడు. ఆ దృశ్యం చూడలేక పిల్లలం దొడ్లో పాకలోకి పారిపోయి దాక్కున్నాం. నాన్నకి అప్పంటే ఆగ్రహం. మా బాబాయిలు పేకాట ఆడి అప్పులు చేసి పొలాలు పోగొట్టుకొని పెళ్లిళ్లు కాకుండా ఉండిపోయారు. అందుకే డబ్బు ఖర్చు విషయంలో నాన్న నిర్దాక్ష్యయంగా ఉండేవారు. అయితే నాన్నకి నేనంటే గారాబం. చదువుల్లో .. ఆటల్లో ఫస్ట్ వస్తానని చాలా సంతోషం. ఇంటికి వచ్చిన రైతులకి స్కూల్లో ఫస్ట్ వస్తానని అపురూపంగా చెప్పేవారు. అది గుర్తు వచ్చి అప్పంటే మరీ భయం వేసింది. ఇలా వెధవ పని చేసి ఆ ప్రేమను పోగొట్టుకోలేను. కథ పంపాలని ఆశ! ఆరాటం! కానీ అప్పు చేయడం కుదరదు. ఎలా? రాముడు తొందర పెడుతున్నాడు (సరే, అని ధైర్యం చేశాను). సత్యం, రాముడు ఒకరోజు రంగమ్మక్కయ్య దగ్గరకు వెళ్లి

అర్ధ రూపాయి అడిగారు. ఆవిడ వెంటనే అనుమాన భూతంలా చూసి ఎందుకంది. "జీడీలు కొనుక్కొని తినాలని ఉంది" అన్నాడు సత్యం. తాతయ్యని అడగండి అనేసింది.

"నువ్వు ఇస్తావా లేదా" అన్నాడు రాముడు. నేను అక్కడనుండి వెళ్లిపోతుంటే చేయి పట్టి ఆపాడు.

"నీకు పిన్నీ పుస్తకాలు చదువుతుంది కదా. నువ్వు ఇయ్యకపోతే ఇకనుంచి నీకు చదవదు మరి" అని బెదిరించాడు.

అక్కయ్య ఆలోచించి జాకెట్లోంచి గుడ్డసంచి తీసి అందులో నుంచి చిల్లర తడిమి అర్ధరూపాయి బిళ్ల తీసి పట్టుకుంది. వెంటనే ఇవ్వలేదు. నేను నిరుత్సాహపడ్డాను. "ఇదిగో, వెంటనే తీర్చాలి. అంతే కాదు. పగలు, రాత్రి పుస్తకాలు చదవాలి. అట్లా అయితేనే ఇస్తా" అంది. సత్యం నావైపు చూశాడు. నేను అక్కర్లేదు అన్నట్లుగా తలూపాను. ఆవిడకి కళ్లు కనిపించవేవి కావు కాబట్టి చూడలేదు. ఈలోగా "అట్లాగే .. సరే" అని సత్యం, రాముడు అనేశారు. నా వైపు చూసి 'ఉత్తుత్తినే' అన్నట్లు నాలుక బయట పెట్టి పెదవులపై అటు ఇటు ఊపారు.



ఆవిడ అర్ధరూపాయి ఇచ్చింది. వెంటనే నా కథ ఆఘమేఘాల మీద పోస్ట్‌కి వెళ్లిపోయింది. చిన్న రశీదు తెచ్చి "దాచుకో" అన్నాడు సత్యం.

నాకు ఆశ్చర్యం వేసింది. కథ వెళ్లిపోయింది. నా దగ్గర లేదు. కథికి గుర్తు చిన్న రశీదు ముక్క మాత్రమే! రోజులు గడిచాయి. మా అక్క నన్ను కథలు చదవమని రాక్షసిలా పీక్కు తింటోంది. అప్పట్లో లాంతరు దీపాలు. రాత్రి 10 గంటలు అయితే గాని లాంతరు దొరకదు. మా అక్క పగలు కుక్కి మంచంలో హాయిగా నిద్రపోయి రాత్రిపూట చదవమని వేధించేది. అలానే చదివేదాన్ని. నేను ఆవిడకి అర్ధరూపాయి కోసం బానిస అయిపోయాను. నా స్వేచ్ఛ అంతా పోయింది.

ఈ కథ రాసి, అర్ధరూపాయి అప్పు చేసి చాలా తప్పు చేశానని కృంగిపోయాను. నా నెత్తిమీద అర్ధరూపాయి అప్పు కొండంత బరువుగా కూర్చుని నన్ను పాతాళంలోకి కృంగదీయసాగింది. మా చిన్న బామ్మ పండగలకి పిల్లలందరికీ అణాలు ఇచ్చేది. అప్పుడు ఆవిడ కూడా లేదు. కాశీ వెళ్లింది.

చాలాసార్లు మా నాన్న దగ్గరికి వెళ్లి తలెత్తకుండా "నాన్నా, నేను చాలా తప్పు చేశాను. అర్ధ రూపాయి అప్పు చేశాను. నన్ను క్షమించు" అని చెప్పాలని ఎంతగానో అనిపించేది. కానీ ధైర్యం చాలేది కాదు. ఇలా మథన పడుతున్నాను. కృంగి పోతున్నాను. ఒకసారి మా నాన్న నన్ను చూసి "ఏమైంది .. ఒంట్లో బాగాలేదా" అని అడిగితే అదిరి పడ్డాను. నాన్నకి తెలిసిపోతుందని మెల్లగా అక్కడి నుంచి వెళ్లిపోయాను.

ఒకరోజు గుడికి వెళ్లి వచ్చాను. రాముడు, సత్యం పరిగెత్తుకొని వచ్చారు. "పిన్నీ .. నీ కథ పడింది. ఇదిగో" అంటూ పత్రిక చూపించారు. నిజంగానా!! అన్నాను.

ముగ్గురం పందిరి కింద వరండాలో కింద కూర్చుని పత్రికను నేల మీద పెట్టి చూస్తున్నాం. నిజంగా నిజం!! 'చిత్రనళినీయం - యద్దనపూడి సులోచనారాణి' అని ఉంది. ముగ్గురం ఒకరి భుజం మీద ఒకరు చేతులేసుకొని కౌగిలించుకున్నాం. నా మనసు షాక్‌లోకి వెళ్లిపోయింది. అంతలో నాన్న వచ్చారు.

సత్యం చెప్పాడు "తాతయ్యా .. పిన్ని కథ రాసింది. పత్రికలో పడింది."

"కథా .. పత్రికా!" ఆశ్చర్యంగా నాన్న పట్టుకుని చూశారు.

"ఏదీ ఆంధ్రపత్రిక .. చదివి వినిపించండి" అత్తయ్య సీరియల్స్ కోసం అరుస్తోంది.

పరువుగల కుటుంబం. ఆడ పిల్లని. కరణంగారి అమ్మాయిని. నా పేరు దేశం మీద పడినట్టు చేశానేమిటి? అని భయపడ్డాను. కానీ నాన్న ఏమీ అనలేదు. పైనుంచి ఇంటికి వచ్చే రైతులకి మా అమ్మాయి కథ రాసింది. పత్రికలో పడింది అంటూ చూపించారు.

హమ్మయ్య అనుకున్నాను.

ఈ వార్త తెలిసి ఇంట్లో కుటుంబ సభ్యులంతా ఏదీ ఏదీ అంటూ ఆంధ్రపత్రికని ఒకరి చేతుల్లోంచి ఒకరు లాక్కుంటుంటే అది వాళ్ల చేతుల్లో ఎక్కడ చిరిగిపోతుందోనని నా ప్రాణం గిలగిలలాడిపోయింది. చివరికి అతికష్టం మీద దొరకపుచ్చుకుని నేను చదువుకునే గదిలోకి పరిగెత్తాను. కథ పేరు, నా పేరు మళ్లీ మళ్లీ చూసుకుని ముద్దుపెట్టుకున్నాను. ఎన్ని సార్లు చూసినా తనివి తీరలేదు. తర్వాత తీసుకెళ్లి నా పుస్తకాల అరలో పుస్తకాల మధ్య ఉన్న సరస్వతీదేవి ఫోటో దగ్గర పెట్టి దండం పెట్టుకున్నాను.

ఆ ఫోటో మా అమ్మ పూజ పీఠం దగ్గర అన్ని దేవుళ్లతో కలిసి ఉండేది. నేను 6వ తరగతి చదివేటప్పుడు తీసుకొచ్చినా పుస్తకాల దగ్గర పెట్టుకున్నాను. రోజూ దొడ్లో విరబూసిసే గరుడవర్ధనం, వాటి మధ్య ఎర్రటి కాశీరత్నం పూలు కలిపి అందంగా దండ గుచ్చి ఫోటోకి వేసుకునేదాన్ని.

కథ పడిందన్న ఆనందంతో నా పాదాలు గాలిలో తేలిపోతున్నట్టు ఉండేవి. అప్పటికే నాకు ఇంగ్లీష్ రాయటం, చదవటం బాగా వచ్చు. నాన్న నన్ను చూసి ముచ్చట పడేవారు. లైబ్రరీ నుంచి ఇంగ్లీష్ పుస్తకాలు తెచ్చిచ్చి చదువుకోమని ప్రోత్సహించేవారు. నాన్న, అన్నయ్యలు నన్ను గారాబంగా చూడటం వల్ల మిగతా కుటుంబ సభ్యులు అందరూ కూడా అభిమానంగా చూసేవారు. ఇప్పుడు ఆంధ్రపత్రికలో నా కథ పడడంతో ఇంట్లో నాకు మరీ ప్రత్యేకత వచ్చింది. నా విలువ బాగా పెరిగిపోయింది. నేను కుటుంబ సభ్యుల మధ్య స్టార్‌ని అయిపోయాను. ఆ ఉత్సాహంతో ఇంకో కథ రాయాలని ఆలోచించసాగాను.

ఆ రోజు మధ్యాహ్నం నాన్న భోజనం చేసి నిద్రపోతున్నారు. ఆయన నిద్రపోతుంటే ఇల్లు అత్యంత నిశ్శబ్దంగా ఉండాల్సిందే. చిన్న చప్పుడు చేయకూడదు. మాటలు కూడా మేము రహస్యంగా మాట్లాడుకునేవాళ్లం. నేను కూడా పడుకున్నాను. ఇంతలో వాకిట్లోంచి బిగ్గరగా "ఈ ఇంట్లో యద్దనపూడి సులోచనారాణి ఎవరండి?" అని పోస్ట్ మ్యాన్ అరవటం వినిపించింది. ఎవ్వరం పట్టించుకోలేదు. అతను మళ్లీ బిగ్గరగా కేక పెట్టాడు.

అందరూ లేచారు. సత్యం సడెన్‌గా నా దగ్గరకు పరిగెత్తుకు వచ్చాడు. "పిన్నీ నువ్వే నువ్వే .. **(మిగతా 21వ పేజీలో)**

# హెయిర్ బ్యూటీ గాడ్జెట్స్..

ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## మ్యాజిక్ హెయిర్ ట్విస్ట్ స్టైలింగ్ బన్ మేకర్
**(Magic hair Twist Styling Bun Maker)**



ఉదయం ఆఫీసుకు టైం అవుతుంటుంది.. పొడుగాటి జుట్టును దువ్వి.. జడేసుకోవాలంటే మరింత ఆలస్యం అవుతుంది. అలా వదిలేస్తేనేమో బయట కాలుష్యం దెబ్బకు జుట్టు రాలిపోతుంది. తల స్నానం చేసినప్పుడయితే జడ వేసుకునేందుకు పడే తిప్పల గురించి చెప్పనవసరం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో ఏం చేయాలో తెలియక ఇష్టం లేకపోయినా జుట్టును పొట్టిగా కట్ చేయించుకుంటుంటారు చాలామంది ఆడవాళ్లు. ఈ 'మ్యాజిక్ హెయిర్ ట్విస్ట్ స్టైలింగ్ బన్‌మేకర్' ఉంటే ఆ ఇబ్బందులన్నీ తొలగిపోతాయి. మీకిష్టమైన స్టైల్‌లో అందమైన జడను చిటికెలో అల్లేయొచ్చు. సమయం ఆదా అవడం మాత్రమే కాదు కొత్త కొత్త పద్ధతుల్లో జడ వేసుకునేందుకు ఈ బన్ మేకర్ ఎంతగానో ఉపయోగ పడుతుంది.






చర్మ రంగుల్లో తేడాలు ఉన్నట్టుగానే మనిషి చర్మ లక్షణాలలో, శిరోజాలలో కూడా అనేక తేడాలు ఉంటాయి. అందుకే అందరికీ అన్ని రకాల షాంపులు, నూనె లు పడవు. అలాగే షేవింగ్ చేసుకునే మిషన్స్ కూడా. పొడి చర్మానికి ఉపయో గించే షేవర్‌ను జిడ్డు



## ఎలక్ట్రిక్ రీచార్జబుల్ వెట్ అండ్ డ్రై ఫాయిల్ షేవర్
(Electric Rechargeable Wet & Dry Foil Shaver)

చర్మానికి వాడితే చర్మం త్వరగా మొద్దు బారి మంట పుడుతుంది. ఇటువంటి ఇబ్బందులను దూరం చేసేందుకు ఈ 'ఎలక్ట్రిక్ రీచార్జబుల్ వెట్ అండ్ డ్రై ఫాయిల్ షేవర్' ఉపయోగపడుతుంది. చర్మం ఎటువంటిదో తెలుసుకుని దానికి తగ్గ మోడ్‌లోకి మారిపోతుంది ఈ షేవర్. పదివేల రకాల మైక్రో వైబ్రేషన్‌లను సృష్టించి కావల్సిన రీతిలో షేవ్ చేస్తుంది. ఒకసారి షేవ్ చేసుకునేందుకు కేవలం ఐదు నిమిషాలు చార్జ్ చేస్తే సరిపోతుంది.

## డైసన్ హ్యుమిడిఫయర్ (Dyson Humidifier)

బయటికి వెళ్లినప్పుడు ఎలాగూ కలుషిత గాలిని పీల్చక తప్పదు. కనీసం ఇంట్లో అయినా స్వచ్ఛమైన గాలి ఉంటే బాగుంటుందనుకుంటాం. అటువంటి గాలిని పీల్చుకునేందుకు ఈ 'డైసన్ హ్యుమిడిఫయర్' ఉపయోగపడుతుంది. యువి టెక్నాలజీ ద్వారా పనిచేసే ఈ గాడ్జెట్ గాలిలోని బ్యాక్టీరియాను నాశనం చేస్తుంది. అంతేకాకుండా స్నానానికి ఉపయో గించే నీటిని కూడా శుభ్రపరిచి చర్మ సౌందర్యానికీ, శిరోజ సౌందర్యానికీ ఎంతగానో సహాయపడుతుంది. కాలుష్యరహిత వాతావరణం మానసిక ఒత్తిడిని దూరం చేస్తుందని వైద్యులు చెబుతుంటారు. పరోక్షంగా శారీరక, మానసిక ఒత్తిడులను దూరం చేసే ఈ గాడ్జెట్‌కు అందుకే ప్రస్తుతం మార్కెట్లో చాలా డిమాండ్ ఉంది.






## స్కాల్పీ హెయిర్ రెజువెనేటర్
**(SCALPEE Hair Rejuvenator)**

శిరోజాలు దృఢంగా, ఆరోగ్యంగా ఉండాలంటే రక్తప్రసరణ మెరుగ్గా ఉండాలి. ఈ 'స్కాల్పీ హెయిర్ రెజువెనేటర్' శరీరం లోని రక్తప్రసరణ వ్యవస్థను మెరుగుపరిచి శిరోజాలను సంరక్షించేందుకు ఉపయోగ పడుతుంది. తలపై పేరుకు పోయిన దుమ్మును, చుండ్రును తొలగించడమే కాకుండా హెడ్ మసాజ్ ద్వారా మానసిక, శారీరక ఒత్తిడిల నుంచి మంచి రిలీఫ్‌ను ఇస్తుంది. తలస్నానం చేసేముందు దీనితో హెడ్ మసాజ్ చేసుకుంటే ఫలితాలు మరింత బాగుంటాయి. జుట్టు రాలడానికి ప్రధానం కారణం ఒత్తిడేనని డాక్టర్లు చెబుతుంటారు కాబట్టి ఆ ఒత్తిడిని దూరం చేసే ఏ పరికరమైనా ఆహ్వానించదగ్గదే. అంతేగాక దీంతో బాడీ మసాజ్ కూడా చేసుకోవచ్చు.



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
# సోరియాసిస్ సమస్యకు సరైన వైద్యం



**డా. శ్రీకాంత్ మోర్లావర్**
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత మానవుని ఉరుకుల పరుగుల జీవన విధానం వలన అధికంగా మానసిక ఒత్తిళ్ళు ఎదురు కావడం, రోజువారీ వ్యాయామ లోపం వంటి అంశాల కారణంగా ఎన్నో రకాల ఆటో ఇమ్యూన్ వ్యాధులకు గురికావడం జరుగుతోంది. అనగా మన అంతర్గత రోగనిరోధక వ్యవస్థ, సొంత కణాలపైనే దాడి చేయడం వలన కలిగే వ్యాధులనే ఆటో ఇమ్యూన్ వ్యాధులుగా పరిగణిస్తారు. ఇలాంటి వ్యాధులలో సోరియాసిస్ వ్యాధి ప్రధానమైనది. ఇది దీర్ఘకాలికంగా వేధించే ఒక సాధారణ చర్మసమస్య. ప్రస్తుత చల్లని వాతావరణం వలన కూడా ఈ సోరియాసిస్ వ్యాధి ప్రేరేపించబడుతుంది. కేవలం మనదేశంలోనే ప్రతి సంవత్సరం 10 మిలియన్‌లకు పైగా సోరియాసిస్ కేసులు నమోదు కాబడుతున్నాయి. ఇతర వైద్యవిధానాలలో సోరియాసిస్ వ్యాధికి పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కేవలం సరైన హోమియోచికిత్సా విధానం ద్వారా మాత్రమే ఈ వ్యాధి పూర్తిగా నయం అయ్యే అవకాశం ఖచ్చితంగా ఉంటుంది.

ఏ వయస్సు వారినైనా ఈ వ్యాధి ప్రభావితం చేస్తుంది. ముఖ్యంగా 15 నుండి 35 సం॥ల మధ్య వయస్సు వారిని ఎక్కువగా ప్రభావితం చేస్తుంది. ఈ వ్యాధి ప్రభావం ముఖ్యంగా చర్మంపై ఉండటం జరుగుతుంది. దీనిలో చర్మం శోథమునకు గురికావడం వలన ఎర్రగా మారి, ఆపై క్రమంగా వెండిరంగు పొలుసుల రూపంలో రాలిపోవడం జరుగుతుంది. ఇది గోళ్ళను మరియు కీళ్ళను కూడా దెబ్బతీస్తుంది. సాధారణంగా చర్మపు జీవితకాలం ఒక నెల వరకు ఉంటుంది. కానీ ఈ వ్యాధికి గురి కావడం వలన చర్మపు కణాలు 10 రెట్లు అధికంగా వృద్ధి చెందడం - తద్వారా అవి చర్మం యొక్క ఉపరితలానికి చేరుకుని, అటుపై గతించడం జరుగుతుంది. ఈ కారణంగా అవి పొలుసులుగా ఊడిపోవడం జరుగుతుంది. అయితే ఈ సోరియాసిస్ వ్యాధి ఒకరి నుండి మరొకరికి సంక్రమించే అంటువ్యాధి మాత్రం కాదు.

### సోరియాసిస్-రకాలు:



**(1) ప్లేక్ సోరియాసిస్:** ఇది సాధారణంగా ఎక్కువ మందిలో కనిపిస్తుంది. దాదాపు 80% సోరియాసిస్ బాధితులలో ఈ రకం వారే ఎక్కువగా ఉంటారు. దీనిలో చర్మంపై ఎర్రని మందపాటి ప్యాచ్‌లు ఏర్పడి తదుపరి అవి వెండిరంగు పొలుసులుగా మారిపోతాయి.

**(2) గట్టేట్ సోరియాసిస్:** దీనిలో చర్మంపై తక్కువ పరిమాణపు ఎర్రని మచ్చలు ఏర్పడతాయి. ప్లేక్ సోరియాసిస్ తదుపరి ఎక్కువ స్థాయిలో ఇది కనిపిస్తుంది.

**(3) ఇన్వర్స్ సోరియాసిస్:** ఇది చర్మపు మడతలలో (ఛాతీ క్రింది భాగంలో, చంకలలో) ఎక్కువగా కనిపిస్తుంది. దీనిలో చర్మం ఎక్కువ ఎరుపుగా, మృదువుగా మెరుస్తున్నట్లుగా కనిపిస్తుంది.

**(4) పస్టులార్ సోరియాసిస్:** దీనిలో చర్మంపై చీముతో నిండిన పొక్కులు ఏర్పడి, వాటి చుట్టూ ఉండే చర్మం ఎర్రగా ఉంటుంది.

**(5) ఎరిత్రోడెర్మిక్ సోరియాసిస్:** ఇది చాలా అరుదుగా కనిపిస్తుంది. దీనిలో చర్మం కాలిపోయినట్లుగా ఉండి, ఎక్కువ పరిమాణం గల పెద్ద పొలుసులుగా రాలిపోవడం జరుగుతుంది. ఇది చాలా ప్రమాదకరమైన సమస్యగా పరిణమించి ఒక్కోసారి ప్రాణాపాయ స్థితిని కూడా కలుగజేసేదిగా ఉంటుంది. వీటితో పాటుగా స్కాల్ప్ మరియు నేయిల్ సోరియాసిస్ రకాలను కూడా మనం చూడవచ్చు.

**కారణాలు:** ఈ వ్యాధికి గల ఖచ్చితమైన కారణాలు లేవు. కానీ జన్యుపరమైన అంశాలు మరియు పర్యావరణ కారణాల సమ్మేళనంగా ఈ వ్యాధి ఏర్పడుతోందని అనుభవపూర్వకంగా తెలుస్తోంది. అధిక మానసిక ఒత్తిడి, వంశపారంపర్యత, రోగనిరోధక వ్యవస్థలోని అసమతుల్యతల కారణంగా కూడా ఈ వ్యాధి కలుగుతుంది.

**లక్షణాలు:** ఈ వ్యాధి లక్షణాలు, వారు గురి అయిన సోరియాసిస్ రకాన్ని బట్టి కొన్ని రోజులు అధికంగాను మరికొన్ని రోజులు స్వల్పంగాను ఉంటాయి. సోరియాసిస్ - తల, మోకాళ్ళు, అరిచేతులు, అరిపాదాలు, ఉదరంపై చర్మాన్ని ప్రభావితం చేస్తుంది. చర్మం ఎర్రబడటం, సాధారణం నుండి అతి తీవ్రమైన దురద, చర్మం దళసరిగా మారడం - తదుపరి వెండిరంగు పొలుసులుగా ఊడిపోవడం జరుగుతుంది. సోరియాసిస్ తలలో ఏర్పడితే - పొలుసులు రాలిపోవటం, జుట్టు రాలడం, అరిచేతులు, అరిపాదాల చర్మం పొలుసులుగా ఊడిపోవడం, చర్మంపై పగుళ్ళు ఏర్పడటం వలన తీవ్రమైన నొప్పి కలగడం, సోరియాసిస్ గోళ్ళను ప్రభావితం చేయటం వలన అవి పెళుసుబారి దృఢత్వాన్ని కోల్పోయి విరిగిపోవడం, వ్యాధి తీవ్రత పెరిగిన సందర్భంలో - కీళ్ళు ప్రభావితం కావటం, తద్వారా కీళ్ళనొప్పులు (సోరియాటిక్ ఆర్థ్రైటిస్) కూడా తలెత్తటం మొ॥గు లక్షణాలు ఏర్పడతాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** చర్మపు బాహ్య లక్షణాలను పరీక్షించడం ద్వారా సోరియాసిస్ వ్యాధిని కొంతవరకు నిర్ధారించవచ్చు. స్కిన్ బయాప్సీ నిర్వహించడం ద్వారా కూడా సోరియాసిస్ రకాన్ని మరియు ఇతర వ్యాధులేవైనా ఉన్నాయా - లేదా అన్న విషయాన్ని కూడా నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** ఎలాంటి ఆటో ఇమ్యూన్ వ్యాధులనయినా హోమియోచికిత్స ద్వారా సంపూర్ణంగా నయం చేయవచ్చు. కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ హోమియోచికిత్సా విధానం ద్వారా, రోగి మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకుని, 'రోగి'కి సరిపడిన ఔషధాన్ని అందించడం ద్వారా - వ్యాధి లక్షణాలను మాత్రమే కాకుండా, వ్యాధి మూలాలను కూడా సమూలంగా నిర్మూలించటం జరుగుతుంది. తద్వారా వ్యాధి మళ్ళీ తిరగబెట్టకుండా పూర్తిస్థాయిలో నయం కాబడుతుంది.

**టోల్ ఫ్రీ 1800 108 1212** | కన్సల్టేషన్ ఉచితం **955 000 1199** | www.homeocare.in

Advt




## నా బొమ్మ

కె. మనోజ్ఞ, 1వ తరగతి
గాన్‌సాలో గార్సియా స్కూల్
పరిగి



## మీకు తెలుసా!

1. ఆస్ట్రేలియాలో పదివేల బీచ్‌లున్నాయి.
3. పసిపిల్లల కంటే కోడిపిల్లలే చురుగ్గా ఉంటాయి.
4. ప్లూటో గ్రహం కన్నా రష్యా వైశాల్యం పెద్దది.
5. మేక కనుపాప దీర్ఘచతురస్రాకారంలో ఉంటుంది.
6. ఆర్మడిల్లో మృగం ప్రతిసారీ నాలుగు పిల్లలకు జన్మనిస్తుంది.

## బైక్ నడుపుతూ యోగా!



నేలపై యోగాసనాలు వేయాలంటేనే కొంచెం కష్టం. అలాంటిది పరిగెత్తే ద్విచక్ర వాహనంపై ఒకదాని వెంట ఒకటి యాభై యోగాసనాలు వేసి ఔరా అనిపించాడు జబల్పూర్‌కు చెందిన రమేష్. అలా అని ఎవరో డ్రైవ్ చేస్తుంటే వెనుక కూర్చుని కాదు... ఒకవైపు బైక్ నడుపుతూనే ఈ యోగా ఫీట్స్ అన్నీ చేశాడు. ఈ విన్యాసం అయిదు కిలోమీటర్ల దాకా కొనసాగింది. అంతకముందు యోగరాజ్ పేరిట ఉన్న ఇరవైమూడు యోగాసనాల రికార్డును డిసెంబరు 21, 2013న బద్దలుకొట్టి కొత్త రికార్డు నెలకొల్పాడు.



## బేతాళ ప్రశ్న - 11



ఐశ్వర్య తన పుట్టినరోజు సందర్భంగా చాక్లెట్స్ కొనడానికి ఒక షాప్‌కి వెళ్లింది. ఒక్కో చాక్లెట్ ఖరీదు రూపాయి. అయితే మూడు చాక్లెట్ రేపర్స్‌ను తిరిగి ఇస్తే ఒక చాక్లెట్‌ను ఉచితంగా ఇస్తామని చెప్పాడు షాపు యజమాని. ఐశ్వర్య దగ్గర 15 రూపాయలు ఉన్నాయి. ఐశ్వర్యకు ఇప్పుడు మొత్తం ఎన్ని చాక్లెట్లు వస్తాయి?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే సమాధానంతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**

**గతవారం సమాధానం:** సెక్యూరిటీ గార్డు చెప్పిన నెంబరులో ఉన్న అక్షరాలెన్నో చెప్పాలి అది కోడ్. మొదటి వ్యక్తితో సెక్యూరిటీ గార్డు '12' (twelve) అంటే వచ్చిన వ్యక్తి '6' అన్నాడు. రెండో వ్యక్తితో '6' (six) అంటే అతను '3' అని చెప్పాడు. సురేష్‌తో '4' అన్నప్పుడు సమాధానం (four) 4 అక్షరాలు కాబట్టి '4' అనే చెప్పాలి. సురేష్ '2' అని చెప్పడంతో కోడ్ తప్పని కనిపెట్టాడు.

**బేతాళ ప్రశ్న- 9 సరైన సమాధానం పంపిన మొదటి ముగ్గురు:** బట్టా రామకృష్ణ దేవాంగ, సౌత్ మోపూరు, శంకరబాబు, బాపట్ల వుటుకూరు వెంకటేశ్వరరావు, ఈమెయిల్

## శాండ్ డాలర్





అకస్మాత్తుగా చూస్తే పొరపాటున జేబులోంచి కిందపడిన నాణెంలా కనిపిస్తోంది కదూ! నిజానికిది ఓ సముద్ర జీవి. తీరంలో ముప్పై నుంచి నలభై అడుగుల లోతులో నివసిస్తుంది. అందుకే శాండ్ డాలర్ అని పేరు పెట్టారు. ఉత్తరార్ధ గోళంలో కనిపించే ఈ శాండ్ డాలర్ నడకలో నత్తతో పోటీ పడుతుంది. దీని ఒంటిపై ఉండే సన్నని దారాల్లాంటి పోగుల సహాయంతో నెమ్మదిగా ముందుకు కదులుతుంది. దీని శరీరంపై గీతల్లా కనిపిస్తున్న వాటిని ట్యూబ్ ఫీట్స్ అంటారు. ఇవి ఆహారాన్ని సేకరించి నోటికి అందిస్తాయి. శాండ్ డాలర్ నోరు శరీరం మధ్యభాగంలో ఉంటుంది. శాండ్ డాలర్ ఎప్పుడూ బోర్లా ఉండే పాకుతుంది. అంటే దాని నోరు కింది భాగంలో ఉంటుందన్నమాట. శాండ్ డాలర్ పైభాగం పెంకులా గట్టిగా ఉంటుంది. దాన్ని పగలగొడితే గట్టిగా ఉన్న తెల్లటి పళ్లు కనిపిస్తాయి. పిల్ల శాండ్ డాలర్లు తమకు ఆపద కలుగుతుందని భావిస్తే... తమలాంటి జీవిని సృష్టించి ప్రమాదం నుంచి తప్పించుకుంటాయి.




## నీళ్ల రాదారి!



ఆ గ్రామాన్ని చూస్తే జానపద కథల్లోంచి ప్రాణం పోసుకుని నేరుగా భూమిపైకి వచ్చేసిందా అనిపిస్తుంది. ఇంట్లోంచి కాలు బయటకు పెడితే అది రోడ్డుపై కాదు... పడవలో పెట్టాలి. ఎందుకంటే ఆ గ్రామంలో రోడ్లు లేవు. వాటి స్థానంలో కాలువలు ఉంటాయి. ఎక్కడికెళ్లాలన్నా తెడ్లు వేసుకుంటూ వెళ్లాల్సిందే. ఈ గ్రామం పేరు గీతూర్న్(Giethoorn). ఇక్కడ నేల అత్యంత సారవంతమైనదని గుర్తించిన చుట్టుపక్కల ప్రాంతాల వాళ్లు దశాబ్దాలుగా మట్టిని తవ్వి తీసుకుపోవడంతో ఊరంతా కాలువలు ఏర్పడ్డాయి. అప్పటినుంచి 'వెనిస్ ఆఫ్ హాలెండ్' అని ముద్దుగా పిలుచుకునే ఈ ఊరికి కాలువలే ప్రధానాకర్షణ అయ్యాయి. వీటిని దాటడానికి 176కు పైగా చెక్క వంతెనలున్నాయి. కొన్నిచోట్ల సైకిల్ ట్రాక్స్ కూడా ఉన్నాయి. ఆధునికతను దరి చేరనీయకుండా ప్రకృతిని పదిలంగా కాపాడుకుంటున్న గీతూర్న్‌లో బోట్లు ప్రత్యేకమైన ఇంజన్ల కారణంగా తక్కువ ధ్వనితో ప్రయాణిస్తాయి. ఈ గ్రామంలో పెద్దగా వినిపించే శబ్దాలేవంటే... బాతులు, ఇతర పక్షులు చేసే శబ్దాలే!






**రియల్ క్రైమ్ కహానీ - 28**

# మూడు హత్యల మిస్టరీ

**పశ్చిమగోదావరి జిల్లా జంగారెడ్డిగూడెంలోని విష్ణు ప్లాజా అపార్ట్‌మెంట్...**

**ఆ ప్రాంతంలో అది బాగా ఫేమస్ అపార్ట్‌మెంట్. అందులోని ఒక ఫ్లాట్‌లో 70 ఏళ్ల వృద్ధుడు హత్యకు గురయ్యాడనే వార్త ఒక్కసారిగా కలకలం రేపింది. సమాచారం అందుకున్న వెంటనే సబ్ ఇన్‌స్పెక్టర్ శ్రీహరిరావు అక్కడికి చేరుకుని వివరాలు సేకరించే పనిలో పడ్డారు.**

**ఈలోపు ఇన్‌స్పెక్టర్ అంబికాప్రసాద్, డీఎస్పీ సుబ్బరాజులు కూడా అక్కడికి చేరుకున్నారు.**

"మృతుడి పేరు కర్పూరం కృష్ణమూర్తి సార్... ఫ్లాట్‌లో ఒక్కరే ఉంటున్నారట. ఆయన పిల్లలు వేరేచోట ఉంటారట. హత్యచేసి నగలు, నగదు దోచుకుపోయారు..."

"ఫ్లాట్‌లో సీసీ కెమెరాలు లేవా?"

"లేవు సార్... వడ్డీ వ్యాపారం చేస్తుంటాడట. బీరువాలోని గోల్డ్, సిల్వర్, క్యాష్‌తో పాటు సెల్‌ఫోన్ కూడా పోయిందని ఆయన బంధువులు చెబుతున్నారు"

"మీరేనా మృతుడి బంధువులు... ఎవరి మీదనైనా మీకు అనుమానాలున్నాయా?" అక్కడ ఉన్న కొందరిని ప్రశ్నించారు డీఎస్పీ.

"లేవు సార్... నిన్న కూడా మా అందర్నీ పలకరించాడు. ఈ దారుణం ఎలా జరిగిందో అర్థం కావట్లేదు" అంటూ బోరుమన్నారు వారంతా.

పోలీసులు మరోసారి క్రైమ్‌సీన్‌ను జాగ్రత్తగా పరిశీలించారు ఆధారాలేమైనా దొరుకుతాయేమోనని. కానీ... నో క్లూ.

•••

జంగారెడ్డిగూడెం డీఎస్పీ కార్యాలయం పోలీసు అధికారులతో కిటకిటలాడుతోంది.

జంగారెడ్డిగూడెం, చింతలపూడి, తడికలపూడి పోలీసుస్టేషన్ల ఇన్‌స్పెక్టర్లు, సబ్ ఇన్‌స్పెక్టర్లు అక్కడికి చేరుకున్నారు.

"ఈ ఏడాదిలో ఇది మూడో హత్య. నిన్న జంగారెడ్డిగూడెంలో వృద్ధుడ్ని ఎవరో చంపేసారు. ఇలాంటి మర్డరే అంతకుముందు కామవరపు కోటలో జరిగింది. అక్కడా ఆంజనేయులనే వృద్ధుడ్ని ఎవరో చంపేశారు. ఇలాగే పెద్దఎత్తున సొత్తు దోపిడీ అయ్యింది. రామచర్లగూడెం దగ్గర హత్యకు గురైన నున్న వెంకట సుబ్బారావు కూడా వడ్డీ వ్యాపారే. అంటే వడ్డీ వ్యాపారులను ఎవరైనా టార్గెట్ చేసి చంపుతున్నారా?" అంటూ డీఎస్పీ సుబ్బరాజు తన సందేహాన్ని వెలిబుచ్చారు.

"మీరన్నట్టుగా బహుశా వీరి గురించి బాగా తెలిసున్నవారే ఇవన్నీ చేస్తున్నట్టు అనుమానముంది సార్..." డీఎస్పీ ప్రశ్నకు బదులిచ్చారు ఇన్‌స్పెక్టర్ అంబికాప్రసాద్.

"ఏదేమైనా మరో హత్య జరిగేలోపు ఈ కేసును పరిష్కరించాలి. హత్యలు జరిగినపుడు ఆయా ప్రాంతాల్లోని మొబైల్స్‌కు సంబంధించి 'టవర్ డంప్' చేయమనండి ఏదైనా క్లూ దొరుకుతుందేమో" అంటూ మీటింగ్ ముగించారు డీఎస్పీ సుబ్బరాజు.

మరుసటి రోజు టవర్ డంప్ మొత్తం వచ్చేసింది. కొన్నివేల కాల్స్ విశ్లేషణ చేయడం ప్రారంభించారు క్రైమ్ పోలీసులు. ఈ క్రమంలో మూడు సెల్ ఫోన్లపై క్రైమ్ పోలీసులు నిఘా పెట్టారు.

అవి మూడు హత్యలు జరిగిన ప్రదేశాలకు దగ్గరలో ఉన్న సెల్‌ఫోన్లు. ఈ ఫోన్లు ఒకరే వాడుతున్నారా? వేర్వేరు వ్యక్తులు వాడుతున్నారా? అనే కోణంలో ముందుగా దర్యాప్తును జరపాలనుకున్నారు. కృష్ణమూర్తి ఇంట్లో దొంగిలించిన సెల్‌ఫోన్‌లో వేసిన సిమ్‌కార్డు నెంబర్ గతంలో ఆంజనేయులు హత్య జరిగిన ప్రాంతంలోని టవర్‌డంప్‌లో ఉండటాన్ని క్రైమ్ పోలీసులు గుర్తించారు. దాంతో ఆ నెంబర్ వాడుతున్న అదే ఊరికి చెందిన దారా నారాయణరావుపై నిఘా పెట్టారు.

"సార్... దారా నారాయణరావు ఎల్ఐసీ ఏజెంట్. రియల్ ఎస్టేట్ వ్యాపారం కూడా చేస్తుంటాడు. కృష్ణమూర్తి ఫోన్ అతడి దగ్గర ఎందుకున్నది అనేది కూపీ లాగే ప్రయత్నంలో ఉన్నాం. ఏదైనా క్లూ దొరుకుతుందేమో చూడాలి" అంటూ దర్యాప్తు జరుగుతున్న తీరును డీఎస్పీకి వివరించారు ఇన్‌స్పెక్టర్ అంబికాప్రసాద్.

"గుడ్... ఆయన ఫోన్ సంభాషణలపై అప్రమత్తంగా ఉండండి" అన్నారు డీఎస్పీ.

వారం రోజుల పాటు పోలీసుల నిఘా కొనసాగిన తర్వాత ఇద్దరు అనుమానాస్పద వ్యక్తులు ముందుగా పోలీసు నెట్‌లోకి వచ్చారు. వారి సంభాషణలతో పాటు, ప్రవర్తనపై కూడా అనుమానాలు బలపడటంతో వెంటనే వారిని లిఫ్ట్ చేశారు జంగారెడ్డిగూడెం పోలీసులు. పోలీసు మర్యాదలు చేసిన తర్వాత నిజం బయటపడింది. "సార్ మీ అనుమానం నిజమైంది హంతకులు దొరికారు" అంటూ డీఎస్పీకి ఫోన్‌లో వివరాలు వెల్లడించారు ఇన్‌స్పెక్టర్ అంబికాప్రసాద్ .

దాంతో మూడు హత్య కేసుల మిస్టరీ ఏకకాలంలో ఛేదించామంటూ కేసు వివరాలను వెల్లడించారు పోలీసులు. మీడియా సమావేశంలో ఆ వివరాలను తెలిపారు డీఎస్పీ.

"చాలా రోజుల కిందట కామవరపుకోటకు చెందిన వాసా ఆంజనేయులు మృతి చెందాడు. మొదట్లో ఆయనది సాధారణ మరణమే అని భావించాం. అయితే ఇంటితాళం పగులగొట్టి ఉండటం, బీరువాలో ఎక్కువ మొత్తంలో బంగారం, డబ్బులు చోరీకి గురవడంతో తడికలపూడి ఎస్సై గుర్రయ్య అనుమానాస్పద మృతిగా దాన్ని నమోదు చేశారు. పోస్టుమార్టం రిపోర్టు ఆధారంగా ఆ తర్వాత దాన్ని హత్యకేసుగా నిర్ధారించుకున్నాం. దారా నారాయణరావుకు ఆంజనేయులు వరుసకు పెదనాన్న అవుతాడు. గతంలో నారాయణరావు తండ్రి ఆంజనేయులు దగ్గర రూ. 60 వేలు అప్పు తీసుకున్నాడు. దాని నిమిత్తం 260 గజాల స్థలం తనఖా పెట్టాడు. అప్పు తీర్చినప్పటికీ వడ్డీ కోసం ఆంజనేయులు తన తండ్రిని బెదిరిస్తుండటంతో నారాయణరావుకు కోపం వచ్చింది. ఆంజనేయులును హత్య చేసేందుకు పథకం పన్నాడు.

ఆంజనేయులు ఇంట్లో ఒంటరిగా ఉన్న సమయం గమనించి సురేష్ అనే వ్యక్తితో కలిసి చేతికి గ్లౌజులు తొడుక్కుని ముక్కు,





నోరు మూసి ఊపిరాడకుండా చేసి హత్య చేశాడు. అనంతరం బీరువాలో ఉన్న బంగారం, వెండి, నగదును దొంగిలించాడు. అయితే పోలీసులు మొదట దాన్ని అనుమానాస్పద మృతి కింద నమోదు చేయడంతో నారాయణరావుకు కొంత ధైర్యం వచ్చింది."

"రామచర్లగూడెం దగ్గర హత్యకు గురైన సుబ్బారావును కూడా నారాయణరావే చంపారా?" ఒక విలేఖరి ప్రశ్నించాడు.

"అవును. సున్న వెంకట సుబ్బారావు దగ్గర నుంచి నారాయణరావు రూ. 6 లక్షలు అప్పుగా తీసుకున్నాడు. వడ్డీ నెలనెలా కడుతున్నా అలస్యమవుతోందని సుబ్బారావు వేధిస్తున్నాడని ఆయనను కూడా హత్య చేయాలనుకున్నాడు. ముందుగా తనకు పెద్ద మొత్తంలో డబ్బు అందిందని, బాకీ చెల్లిస్తానని సురేష్ ద్వారా కబురుపంపాడు. దాంతో సుబ్బారావు తన యాక్టివా వాహనంపై వెళ్లాడు. అప్పటికే కారులో రెండు ఇనుప రాడ్లు పెట్టుకుని నారాయణరావు వేచి చూస్తున్నాడు. 'డబ్బు వస్తోందని, ఈలోగా అక్కడికి దగ్గరలో వేసిన కొత్త వెంచర్‌ను చూసొద్దాం' అంటూ కారులో ఎక్కించుకున్నాడు. అప్పటికే కారులో సురేష్ కూడా ఉన్నాడు. కొంతదూరం వెళ్లిన తర్వాత వెనుక సీట్లో కూర్చున సురేష్ రాడ్‌తో సుబ్బారావు తలపై, ముఖంపై కొట్టి హత్య చేశాడు. మృతదేహాన్ని కారులో తీసుకువెళ్లి రామచర్లగూడెం వద్ద పడేశారు. ఆ తర్వాత ఇద్దరూ రాజమండ్రిలో లాడ్జి తీసుకుని, మరుసటి రోజు గోదావరిలో స్నానం చేసి అక్కడే బట్టలు వదిలేసి, కారు సర్వీసింగ్ చేయించుకుని జంగారెడ్డిగూడెం తిరిగొచ్చారు" అంటూ వివరించారు ఇన్‌స్పెక్టర్.

"రెండు హత్యల్లో కూడా హంతకులు తెలివిగా తప్పించుకున్నారు. క్రమక్రమంగా నారాయణరావు క్రైమ్‌కు అలవాటు పడ్డాడు. అయితే ఈసారి మాత్రం వారి పప్పులుడకలేదు. తన బంధువైన కృష్ణమూర్తి వద్ద ఎప్పుడూ నగదు, బంగారం ఉండటాన్ని గమనించిన నారాయణరావు అదను చూసి ఆయన్ని హతమార్చాలనుకున్నాడు. పథకం ప్రకారం కృష్ణమూర్తిని అటాక్ చేశారు. తనకు హెల్ప్ చేసిన సురేష్, బ్రహ్మాజీలకు దోచుకున్నదాంట్లో కొంత ఇచ్చాడు నారాయణరావు. అయితే సెల్‌ఫోన్ డంప్ విశ్లేషణలో వీరి గుట్టు రట్టయ్యింది. నారాయణరావు ఫోన్ మీద నిఘా పెట్టడం వల్ల మిగతా ఇద్దరు కూడా నెట్‌లోకి వచ్చారు. మా పద్ధతుల్లో ట్రీట్‌మెంట్ ఇచ్చి, వారి నుంచి పూర్తి సమాచారాన్ని సేకరించిన తర్వాత నారాయణరావు నోరు విప్పక తప్పలేదు" అంటూ సమావేశాన్ని ముగించారు డీఎస్పీ సుబ్బరాజు.

**- వేముల సత్యనారాయణ, 9985488800**

## చిత్రనళినీయం...

**15వ పేజీ తరువాయి...**

తొందరగా రా" అని నా చేయిపట్టి లాగాడు. అప్పుడు గుర్తుకు వచ్చింది అది నా పేరే! రెండేళ్ల క్రింద పెళ్లైంది కాబట్టి నా ఇంటి పేరు ముందు యద్దనపూడి అని వచ్చింది. వరండాలో ఉన్న పోస్ట్ మ్యాన్ దగ్గరికి పరిగెత్తాము.

సత్యం : ఇదిగో మా పిన్ని.

పోస్ట్ మ్యాన్ నమ్మలేదు. "ఈ అమ్మాయిగారా!" అన్నాడు.

"అవును. నేనే. నాకేదైనా ఉత్తరం ఉందా?" అని అడిగాను.

"అమ్మాయిగారూ మీకు మనీ ఆర్డర్ ఉందండి" అన్నాడు.

సత్యం, నేను అయోమయంగా మొహాలు చూసుకున్నాం. "ఎక్కడిది. ఎంత డబ్బు?" వాడు ఆత్రంగా అడిగాడు.

"ఆంధ్రపత్రిక నుంచి .. 15 రూపాయలు అమ్మాయిగారూ .." అన్నాడు పోస్ట్ మ్యాన్.

"ఇదిగోండి .. ఇక్కడ సంతకం పెట్టండి" అని ఫారం ఇచ్చాడు. వేలుతో చూపించాడు. 'యద్దనపూడి సులోచనారాణి' అని చేసిన నా తొలి సంతకం అదే. ఇంతలో అందరూ అక్కడికి వచ్చారు. ఆ డబ్బు తీసుకుంటుంటే నా కళ్లు ఆశ్చర్యంతో పత్తికాయలు అయినాయి. అది ఆనందమో, ఆశ్చర్యమో, లేక మరో అద్భుతమో లేక ఈ మూడూ కలిసిన భావమో నాకు ఏమీ తెలియడం లేదు.

ఇంతలో నాన్న వచ్చాడు 'ఏమిటీ గొడవ'ంటూ.

"పిన్ని రాసిన కథకి మనీ ఆర్డర్ వచ్చింది" అన్నాడు సత్యం.

"15 రూపాయలు" అన్నాడు రాముడు.

"అమ్మాయిగారూ .. మీ కథకు 15 రూపాయలు తెచ్చాను. నాకు కాఫీ తాగటానికి ఇవ్వాలి" అన్నాడు పోస్ట్ మ్యాన్. నాన్న జేబులోంచి చిల్లర తీసి అతని చేతిలో పెట్టారు. నేను నాన్న చేతికి 15 రూపాయలు ఇచ్చేశాను. నాన్న డబ్బు తీసుకోలేదు. నన్ను దగ్గరకు తీసుకున్నారు. "నువ్వు ఏదైనా కొనుక్కో" అంటూ ప్రేమతో తలమీద నిమిరారు. ఇంతలో కరణం గారూ అంటూ రైతులు వస్తే నాన్న వెళ్లిపోయారు. మా రంగం అక్కయ్య 'నాకు నువ్వేమీ అప్పు తీర్చక్కర్లేదు .. నన్ను గుర్తుపెట్టుకో చాలు' అంది.



అసలు కథ రాయటమే అపురూపం. అది ప్రచురణ అవ్వడం ఇంకో అదృష్టం. దానికి తోడు ఎక్కడో చిన్న పల్లెటూరులో ఉన్న నన్ను వెతుక్కుంటూ 15 రూపాయలు మనీ ఆర్డర్ రావటం ఇంకా అద్భుతం. ఇలా నా జీవితంలో అద్భుతం మీద అద్భుతం జరిగిపోయి .. ఇంట్లోవారంతా నన్ను అదృష్టవంతురాలని మెచ్చుకునేలా చేశాయి.

మర్నాడు నేను, రాముడు, సత్యంతో కలిసి కమలత్తయ్య మొగుడు రాజు మావయ్య దగ్గరికి వెళ్లి నాన్నకి 15 రూపాయలతో జరీ పంచలు తెమ్మని చెప్పాను. ఎవ్వరికీ చెప్పొద్దన్నాను. మావయ్య పంచలు తెచ్చారు. నేను నాన్నకి అవిచ్చి కాళ్లకి నమస్కారం చేశాను.

"నాకెందుకమ్మా" అన్నారాయన.

నాన్న అవి కట్టుకుని పొలం వెళుతూ కమలత్తయ్య దగ్గరకి వెళ్లి 'పాప తన సంపాదనతో ఈ జరీ పంచలు కొనింద'ని మురిపెంగా చెప్పారని అత్తయ్య మర్నాడు వచ్చి నాకు చెప్పింది. నాకు సంతోషం వచ్చేసింది.

నాన్నకి నేనిచ్చిన నా మొదటి సంపాదన పంచలు మాత్రమే. ఆ తర్వాత సంవత్సరం నాన్న పోయారు.

నేను రచయిత్రిగా ఎదిగిన తర్వాత వేలు, లక్షలు సంపాదించాను కానీ నా తల్లిదండ్రులు నా పేరు ప్రతిష్ఠలు చూడలేదు. వారికి నేనేమీ ఇవ్వలేకపోయాను. ఈ బాధ నా గుండెల్లో ఎప్పుడూ ఉంటుంది.

● రచయిత్రి ఫేస్‌బుక్ నుండి




## ఆ పాలు తోడుకోవు ...



ఏ పాలైనా పెరుగుగా తోడుకుంటాయి కానీ ఒంటె పాలు తోడుకోవు. కారణం ఒంటె పాలలోని మాంసకృత్తుల నిర్మాణం ఆవు, మేక, గొర్రె పాలతో పోలిస్తే విభిన్నంగా ఉంటుంది. ఇలా విభిన్నంగా ఉండటానికి ఎడారిలోని విపరీతమైన ఉష్ణోగ్రతలే కారణం. అయితే ఒంటె పాలు ఎక్కువ కాలం నిల్వ ఉంటాయి. పాలు పలుచగా ఉండి కొవ్వు శాతం చాలా తక్కువగా ఉంటుంది కాబట్టి సులభంగా జీర్ణమవుతాయి. శరీరంలోని గ్లూకోజ్‌ను నియంత్రణలో ఉంచడమే కాదు.. చెడు కొలెస్ట్రాల్‌ని తగ్గిస్తుంది కాబట్టి షుగర్ పేషెంట్లకు మంచిది.

## ఆకాశంలో రెండు ఇంద్రధనుస్సులు...



చిటపట చినుకుల మధ్య నీరెండలో వెలిసే ఇంద్రధనుస్సు భలే ఉంటుంది కదా! అలాంటిది ఒకేసారి ఆకాశంలో రెండు ఇంద్రధనుస్సులు కనువిందు చేస్తే అది అద్భుతమే. మరి ఆ అద్భుతం ఎలా సాకారమౌతుందో చూద్దాం.

సూర్యకిరణం వానచినుకులోంచి ప్రయాణిస్తూ సరిగ్గా 42 డిగ్రీల కోణంలో పరావర్తనం చెందినపుడు ఏడురంగుల ఇంద్రధనుస్సు ఆవిష్కరించబడుతుంది. ఒక్కోసారి వాన చినుకులోకి ప్రవేశించిన సూర్యకిరణం రెండుసార్లు పరావర్తనం చెందడం వల్ల ఆకాశంలో రెండు ఇంద్రధనుస్సులు ప్రత్యక్షమవుతాయి. ఈసారి సూర్యకిరణం 51 డిగ్రీల కోణంలో పరావర్తనం చెందుతుంది. ఇది పరావర్తనానికి పరావర్తనం అన్నమాట. అందుకే రెండో ఇంద్రధనుస్సులో రంగులు మొదటిదానికి రివర్సుగా కనిపిస్తాయి. అంటే మొదటి ఇంద్రధనుస్సులో చివరి రంగైన ఎరుపు, రెండో ఇంద్రధనుస్సులో మొదటిదవుతుంది.

## అతడు - ఆమె - ఒక కోపం



"ఇద్దరి మధ్యా మాటామాటా పెరిగింది. అతను కోపంగా సెల్ ఫోన్ నేలకేసి బలంగా కొట్టాడు. ఆమె అదే రేంజ్‌లో సెల్‌ఫోన్‌ను సోఫాలోకి విసిరింది.

పది నిమిషాలు గడిచాయి. ఇద్దరిలోనూ కోపం చల్లారింది.

అతను పగిలిన ఫోన్ ముక్కలు ఏరుకుంటున్నాడు.

ఆమె సోఫాలో కూర్చుని సెల్ ఫోన్‌లో ఫేస్ బుక్ ఓపెన్ చేసింది.

**నీతి :** ఆడవారు ఆవేశంలో కూడా తెలివిగా ఆలోచించగలరు.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

## అది పిల్లల గొడవ

"పక్కింటి ఆంటీ, అంకుల్ మాటిమాటికి చిన్న పిల్లల్లా పోట్లాడుకుంటారెందుకు మమ్మీ?" సందేహం వెలిబుచ్చాడు చింటు.

"వాళ్లది బాల్యవివాహం లేరా .." బదులిచ్చింది మమ్మీ.

## దాంపత్య రహస్యం



"నేను ఇంటికి వెళ్లేసరికే నా భార్య భోంచేసి పడకెక్కేస్తుంది" వీరబాబు.

"నా భార్య భోంచేయకుండా నాకోసం ఎదురుచూస్తూ ఉంటుంది" బుచ్చిబాబు.

"ఈ కలియుగంలో అలాంటి భార్య దొరకడం నీ అదృష్టం" వీరబాబు.

"అదృష్టమా .. బొందా. ఇంటికి వెళ్లి నేనే వంట చేసి పెట్టాలి" బుచ్చిబాబు.

## అంత సీన్ లేదమ్మా!

"రాజేష్‌గాడికి పెళ్లాం అంటే ఎంత ప్రేమరా .. రోజూ వాళ్ల ఆవిడకోసం మల్లెపూలు తీసుకెళ్తాడు" ఆశ్చర్యపోయాడు శ్రీకర్.

"ప్రేమ పెళ్లాం మీద కాదురా .. పూలమ్మే అమ్మాయి మీద .." బదులిచ్చాడు రమాకాంత్.

## అందుకేనా ఆఫీసుకెళ్లడం

"కామూ .. నువ్వు కట్టిన క్యారేజ్ తినకుండా తెచ్చేశాను .. కుదర్లేదోయ్" మూ విప్పుతూ చెప్పాడు పీతాంబరం.

"చోద్యం కాకపోతే .. ఎంత ఆఫీసు అయితే మాత్రం తిండి తినకుండా నిద్రపోతారటండీ" ముక్కున వేలేసుకుంది కామాక్షమ్మ.

## ఛాయా'చిత్రం'



"ఒరేయ్ .. పక్కకి లెగరా, నేను పాలు తాగాలి"

## మీరివ్వరని తెలిసింది

"ఈరోజు స్కూల్లో కొత్త విషయాలేమైనా తెలుసుకున్నావా బంటీ?" అడిగాడు డాడీ.

"ఆc .. పిల్లలందరికీ వాళ్ల డాడీలు పాకెట్‌మనీ ఇస్తారట" చెప్పాడు బంటీ.

## రాసలీల మదనుడు



"నన్ను అమితంగా ప్రేమించే రజనికి ద్రోహం చేస్తానేమో అని బాధగా ఉందిరా .." చెప్పాడు మదన్.

"అంటే నీ పెళ్లి రజనితో జరగటం లేదా .." అడిగాడు వీరన్.

"రజనితో ఫిక్స్ అయ్యింది కాబట్టే .." అసలు విషయం చెప్పాడు మదన్.

## ఎవరు కొట్టినా దెబ్బలేగా!

"ఇప్పటివరకూ మీసమున్న మొగాడెవడూ నా ఒంటిమీద చెయ్యి వెయ్యలేదు తెలుసా" గొప్పగా చెప్పాడు వీరమల్లు.

"అంటే నీ ఒంటిమీది దెబ్బలన్నీ ఆడవాళ్లు కొట్టినవేనా .." అమాయకంగా అడిగాడు జగన్నాథం.

## అడవిలో మాను మేలమ్మా!

"పెళ్లి అయినా, కాకపోయినా అమ్మాయిలకే కష్టాలు రాసి పెట్టాడు దేవుడు" పెదవి విరిచింది సుభద్రమ్మ.



"అదెలా ..." అడిగింది అనంతమ్మ.

"పెళ్లయ్యేవరకూ ఎలాంటి వాడొస్తాడో అని బెంగ. పెళ్లయ్యాక కట్టుకున్నవాడు చెప్పిన మాట వింటాడో లేదోనని బెంగ .."

ఈ వారం కవితలు

## ఆచూకీ

గుర్తు తెలీని ఒక మనిషిని
దహనం చేస్తున్నారు

●●●

నువ్వూ నేనూ పంచుకోవాల్సిన ఆస్తి మధ్యలో
        కోతొకటి రొట్టెలా తినేస్తోంటే
నువ్వూ నేనూ పుట్టిన నేలని
కొత్త శ్మశానాల కోసం సమీకరిస్తోంటే
పచ్చటి ఉనికై ఎర్రగా మండిన మనిషిని
జనాభా లిస్టులో దొరకని ఆచూకీలా
        దహనం చేస్తున్నారు.
గాయాల్తో చిల్లులు పడ్డ గుండెని
చిల్లుల్లోంచి చిట్లిపోయిన నరాల్ని
చూపు తెగిపోయిన సగం గాజు కళ్లని
ఆయుధంలా మోసుకు తిరిగిన
శరీరం మొత్తాన్నీ
చీకటి దుప్పట్లో ఉండగా చుట్టేసి వెలుతురు
        రాక ముందే దహనం చేస్తున్నారు
వాడి ఊరూ పేరూ చదువూ పదవీ మాటా పాటా
నడుం చుట్టే కట్టుకు తిరిగిన తూటా సంచి
భుజమ్మీది తుపాకీ, చేతిలో పుస్తకం.
అన్నింటినీ గుర్తించలేని మన భయం గుమ్మం ముందు
పండుగ రోజు సజీవ దహనం చేస్తున్నారు

●●●

ప్రాణాలొడ్డిన వాడి కల ఆచూకీ
సామూహిక దహనమౌతున్న చోట
తిరుగుబాటు లేని స్వేచ్ఛని పీల్చలేక సగం కాలిన దేహం
ఊపిరికడ్డు పడుతోంది.

- శ్రీరాం పుప్పాల, 99634 82597

## నడక సాగుతుంది...



చెట్లు నరికి వేస్తున్నారు
అడవి మాయమవ్వాలని
నీళ్లు తోడి పోస్తున్నారు
సముద్రమెండి పోవాలని
పదాల్ పేల్చి వేస్తున్నారు
పాట చచ్చిపోవాలని -
        విత్తనాలనెలా ఉరి తీస్తారు
        జలను ఎలా అడ్డుకుంటారు
        ఉబికి వచ్చే సంగీతాన్ని
        ఊపిరినుంచెలా వేరు చేస్తారు -
విరిగి పడింది కొండ చరియ
దారి మూసుకుపోయింది
రాళ్లు తొలగించక తప్పేదేముంది
దారెక్కడికి పోతుంది
చేరాల్సిన ఊరెక్కడికి పోతుంది
మొదలైన నడకెక్కడికి పోతుంది ..

- ఆర్. రాఘవరెడ్డి, 96529 02192

బొమ్మలు : అక్బర్

# అనుగ్రహం

డాక్టర్ పి.ఎ.రామన్



**మేషం : అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

గృహ మార్పు అనివార్యమవుతుంది. కొత్త యత్నాలు మొదలెడతారు. ఒక సమాచారం నిరుత్సాహ పరుస్తుంది. పనులు అనుకున్న విధంగా సాగవు. అవసరాలకు ధనం అతికష్టంమ్మీద సర్దుబాటువు తుంది. గురు, శుక్ర వారాల్లో కావలసిన వ్యక్తుల కలయిక అనుకూలించదు. విలువైన వస్తువులు జాగ్రత్త. ఆహ్వానాలు అందుకుంటారు. మీ శ్రీమతితో జాగ్రత్తగా మెలగండి. చిన్న విషయమే వివాదమవుతుంది. ఓర్పుతో వ్యవహరించండి. దళారుల పట్ల అప్రమత్తంగా ఉండాలి.



**వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

మీ వాక్కు ఫలిస్తుంది. ప్రముఖులతో పరిచయాలు బలపడతాయి. వ్యూహాత్మకంగా వ్యవహరిస్తారు. ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. పొదుపు మూలక ధనం అందుతుంది. ఆత్మీయులకు కానుకలు చదివించుకుంటారు. పనులు హడావుడిగా సాగుతాయి. శనివారం నాడు ధనం డ్రా చేసేటపుడు జాగ్రత్త. ఆంతరంగిక కుటుంబ విషయాలు గోప్యంగా ఉంచండి. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. మీ శ్రీమతి వైఖరిలో ఆశించిన మార్పు వస్తుంది. మీ బలహీనతలు అదుపులో ఉంచుకోవాలి.



**మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

ఈ వారం ప్రారంభోత్సవాలకు అనుకూలం. బంధువులతో సత్సంబంధాలు నెలకొంటాయి. ఖర్చులు పెరిగినా ధనానికి ఇబ్బంది ఉండదు. సకాలంలో చెల్లింపులు జరుపుతారు. వ్యవహారాలు, పనులు స్వయంగా చూసుకోవాలి. పరిచయం లేని వారితో జాగ్రత్త. గుట్టుగా యత్నాలు సాగించండి, మీ ఆలోచనలు తప్పుదారి పట్టే ఆస్కారం ఉంది. పెద్దలతో సంప్రదింపులు జరుపుతారు. మీ అభిప్రాయాలను సున్నితంగా తెలియజేయండి.



**కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

స్థిమితంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ఇతరుల అభిప్రాయాలకు విలువ ఇవ్వండి. ఏకపక్ష నిర్ణయం తగదు. మీ అభిప్రాయాలను సున్నితంగా తెలియజేయండి. ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు సానుకూలమవుతాయి. ఆదాయ వ్యయాలు ఫర్వాలేదనిపిస్తాయి. పదవులు, సభ్యత్వాల నుంచి తప్పుకోవలసి వస్తుంది. వివాదాస్పద విషయాల్లో జోక్యం తగదు. ఉద్యోగస్తులకు ధనప్రలోభం తగదు.



**సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

సంప్రదింపులు, వ్యవహారాలతో హడావుడిగా ఉంటారు. గృహమార్పు యత్నం ఫలిస్తుంది. ఆసక్తికరమైన విషయాలు గ్రహిస్తారు. ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులుంటాయి. కీలక పత్రాలు, వస్తువులు, నగదు జాగ్రత్త. ఆది, సోమ వారాల్లో పనులు మొండిగా పూర్తి చేస్తారు. ప్రముఖుల కలయిక వల్ల ఏమంత ప్రయోజనం ఉండదు. మీ శ్రీమతి ఆకస్మిక ప్రయాణం ఇబ్బంది కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు ఏకాగ్రత ప్రధానం. ప్రైవేట్ సంస్థలలోని వారికి మార్పులు అనుకూలిస్తాయి.



**కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

ఆర్థికంగా నిలదొక్కుకుంటారు. రుణ బాధలు తొలుగుతాయి. ఖర్చులు సామాన్యం. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. వేడుకల్లో పాల్గొంటారు. బంధుత్వాలు బలపడతాయి. మీ సిఫార్సుతో ఒకరికి సదవకాశం లభిస్తుంది. మంగళ, బుధ వారాల్లో పనులు హడావుడిగా సాగుతాయి. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. దంపతులకు కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. సంతానం విజయం సంతోషాన్నిస్తుంది. పెట్టుబడులు, పొదుపు పథకాలకు మంచి సమయం.



**తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

ఆదాయ వ్యయాలు సంతృప్తికరం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పనులు నిదానంగా సాగుతాయి. శుభకార్యాలకు హాజరవుతారు. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. మీ శ్రీమతితో ఉల్లాసంగా గడుపుతారు. గృహ నిర్మాణాలు వేగవంతమవుతాయి. ముఖ్యమైన సమావేశాల్లో పాల్గొంటారు. కొన్ని సందర్భాల్లో మీ జోక్యం అనివార్యమవుతుంది. గురు, శుక్రవారాల్లో ఒత్తిడి, చికాకులు, విశ్రాంతి లోపం. వ్యవహారాల్లో కీలక నిర్ణయం తీసుకుంటారు. నూతన పెట్టుబడులకు అనుకూలం.



**వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

ఎదుటి వారి వ్యాఖ్యలు ఉద్రేకపరుస్తాయి. సంయమనం పాటించండి. వ్యతిరేకించిన వారే మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. పరిచయాలు ఉన్నతికి దోహదపడతాయి. ఒక సమాచారం ఆలోచింపచేస్తుంది. ఆదాయ వ్యయాలకు పొంతన ఉండదు. పెద్ద ఖర్చు తగిలే ఆస్కారం ఉంది. మితంగా వ్యయం చేయండి. శనివారం నాడు పనులు సాగక విసుగు చెందుతారు. పట్టుదలతో యత్నాలు సాగించండి. మీ కృషి త్వరలో ఫలిస్తుంది. సంతానం గురించి ఆందోళన చెందుతారు.



**ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

ఆర్థిక లావాదేవీలు సంతృప్తినిస్తాయి. కొత్త వ్యాపారాలకు శ్రీకారం చుడతారు. ప్రముఖ సంస్థలతో భాగస్వామ్యం అనుకూలిస్తుంది. వ్యవహార ఒప్పందాల్లో ఏకాగ్రత వహించండి. స్తోమతకు మించి హామీలివ్వద్దు. ఆది, సోమ వారాల్లో పనులు, బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. వాగ్వాదాలు, అవగాహన లేని విషయాల్లో జోక్యం తగదు. ఆహ్వానాలు అందుకుంటారు. కుటుంబీకులతో సంప్రదింపులు జరుపుతారు.



**మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు**

యత్నాలు ప్రోత్సాహకరంగా సాగుతాయి. అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తారు. పనులు సానుకూలమవుతాయి. చిన్నారులు, ఆత్మీయులకు కానుకలు చదివించుకుంటారు. బంధువులతో తెగిపోయిన సంబంధాలు బలపడతాయి. సంతానం వైఖరి చికాకు పరుస్తుంది. సామరస్యంగా మెలగండి. వ్యవహారాలు మీ చేతుల మీదుగా సాగుతాయి. మీ అభిప్రాయాలకు స్పందన లభిస్తుంది. మంగళ, బుధ వారాల్లో ఆరోగ్యం మందగిస్తుంది.



**కుంభం : ధనిష్ఠ 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

ఆదాయం బాగుంటుంది. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. రశీదులు, విలువైన పత్రాలు జాగ్రత్త. పదవులు, బాధ్యతలు స్వీకరిస్తారు. పలుకుబడి గణనీయంగా పెరుగుతుంది. పొగడ్తలు, మొహమ్మాటాలకు పోవద్దు. ఆది, గురు వారాల్లో ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. అయిన వారితో సంప్రదింపులు జరుపుతారు. మీ అభిప్రాయాలకు స్పందన లభిస్తుంది. శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలకు అనుకూలం. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. విద్యార్థులు పోటీల్లో రాణిస్తారు.



**మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

స్వయంకృషితో రాణిస్తారు. అప్రయత్నంగా అవకాశాలు కలిసివస్తాయి. గృహంలో ప్రశాంతత నెలకొంటుంది. ఊహించిన ఖర్చులే ఉంటాయి. వస్తువుల కొనుగోలులో నాణ్యతను గమనించండి. పనులు సకాలంలో పూర్తి కాగలవు. పరిచయాలు, వ్యాపకాలు విస్తరిస్తాయి. సన్నిహితులకు సహాయ సహకారాలందిస్తారు. మంగళ, శని వారాల్లో కీలక పత్రాలు, ఆభరణాలు, నగదు జాగ్రత్త. కొత్తవారిని విశ్వసించవద్దు. ఉద్యోగ బాధ్యతల్లో మార్పులుంటాయి. ప్రశంసలు అందుకుంటారు.

## అవునా!



ప్రపంచంలోని అతి చిన్న ఎస్కలేటర్ జపాన్‌లోని కవసాకిలో ఉంది. దానికి ఐదే మెట్లు ఉన్నాయి.

b రబ్బర్లు కనిపెట్టడానికి ముందు పెన్సిల్ గీతలను చెరపడానికి బ్రెడ్ ముక్కలను వాడేవారు.

b కొందరికి చలి ఎలర్జీ ఉంటుంది. ఆ లక్షణాన్ని Cold Urticaria అంటారు.



1912 కన్నా ముందు కారు టైర్లు తెలుపులో గాని, బూడిద రంగులో గాని ఉండేవి.

b సాధారణంగా ఇటలీ ఉత్తర ప్రాంతంలో నివసించే వారందరి పేర్లు 'i' అక్షరంతో, దక్షిణ ప్రాంతంలో నివసించే వారందరి పేర్లు 'o' అనే అక్షరంతో ముగుస్తాయి.

b మంచినీళ్లు దొరకనప్పుడు పెంగ్విన్లు ఉప్పు నీటిని తాగి బతుకుతాయి.



ఆస్ట్రేలియాలో ఒక కొండ పేరు మౌంట్ డిసపాయింట్‌మెంట్. కష్టపడి పైకెక్కితే అక్కడ నుంచి అందమైన దృశ్యాలేమీ కనబడలేదని బ్రిటిషు వాళ్లు ఆ పేరు పెట్టారట.

b నక్కల గుంపును 'ఎర్త్' అంటారు.

b ఫ్రెంచ్ వాళ్లకు ఇంకా వలసదేశాలు ఉన్నందువల్ల వారి దేశస్తులు అందరికంటే ఎక్కువగా 12 టైమ్ జోన్లలో బతుకుతుంటారు.

# అదృష్ట రత్నజ్యోతి


## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554


**ఎమ్.ఎన్.కె., ఖమ్మం**

**నా భర్త జన్మకుండలి వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం-

నక్షత్రం ఉత్తరాషాఢ. ధనూరాశి.

1. విద్య కామర్స్‌లో డిగ్రీ, శని చంద్రుల వలన.

2. 39 వయసు వరకూ సాధారణంగా నడిచి, అక్కడి నుండి యోగించే జన్మకుండలి ఇది.

3. అలాగే 39 వరకూ ఉద్యోగం. అప్పటి నుండి వృత్తిలో స్వతంత్రత... ఉద్యోగం, వ్యాపారం రెండూ బ్రోకింగ్‌లోనే! బృహస్పతి, అధిపతి శని వలన షేర్స్, స్పెక్యులేషన్‌లో లాభిస్తుంది.

4. రాహువులో రాహువులో... అంటే 22 నుండి 24 వయసులో కుటుంబ సభ్యుల్లో ఒకరికి ప్రాణ గండం, అశుభకార్యం. (జరిగిపోయిన సంఘటన కనుక నిర్మొహమాటంగా వ్రాయడం జరిగింది.)

5. రాహువులో బృహస్పతి... 24 నుండి 27 మధ్య అటు ఉద్యోగం, ఇటు కన్సల్టెన్సీ. ఈ అంతర్దశలో కళ్యాణ ఘడియలు ఉన్నా కూడా వివాహం చేసుకోకూడదు... విడిపోతారు.

6. రాహువులో శనిలో 28లో వివాహం. ఎవరి వలన ఆలస్యమయిందో ఆయనే వివాహం ఇవ్వడం జరుగుతుంది! ఇదే పీరియడ్‌లో కెరీర్‌లో బాగా పుంజుకోవడం. ఉద్యోగం మాని, స్వతంత్రంగా ఉండాలని చేసే ప్రయత్నాలు.

7. 29 నుండి 32 మధ్య బుధాంతర్దశ. తండ్రికి గండం. అయితే అది చంద్ర శుక్రుల వలన ప్రాణానికి ముప్పు కాకుండా తప్పిపోవడం. ఒక తీర్థయాత్ర చేయడంతో బుధుని ఆధిపత్యం పనిచేసి తండ్రిని రక్షించడం జరుగుతుంది.

8. 32, 33లో కేతువు అంతర్దశ. యాక్సిడెంట్ కాకపోతే అదృష్టమే. రాహు కేతువులకు, బాధా కారకునికీ గట్టి పరిహారాలు పాటించి తప్పించుకోవలసి ఉంటుంది. పాటిస్తే తప్పించడానికి శుక్రుడు అనుకూలంగానే ఉన్నాడు కనుక పరిహారాలు పని చేస్తాయి.

9. 33, 34, 35 వయసులో శుక్రుని భుక్తి. వృత్తిలో ఇవ్వగలిగినంత ఉన్నతి. ఫోర్‌వీలర్ యోగం. వీటికి చంద్రుని నుండి కావలసినంత, రావలసినంత సహకారం.

10. 36లో సూర్యాంతర్దశ. ఇతరత్రా బాగానే ఉంటుంది కానీ, కుటుంబ జీవితంలో కలహాలు, ఆవేశం, నోరు జారడం, పదే పదే ఏదో ఒక అశుభ కార్యానికి వెళ్ళాల్సి రావడం.

ఈ పీరియడ్‌లో పాటించాల్సిన పరిహారాలు-

అ) రవి రాహువులకు.

ఆ) అగ్ని దాహాదపి విశిష్టం వాక్పారుష్యమ్! నాలుక అదుపులో ఉంచుకోవాలి.

ఇ) తక్కువ స్థాయి స్త్రీలను దగ్గరకు చేర్చకూడదు.

11. 37లో... చంద్ర భుక్తిలో చేంజాఫ్ ప్లేస్.

12. 38లో... కుజ భుక్తిలో బిజినెస్ చేయాలన్న ఊహ ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. కారణం రుచక మహాపురుష యోగంలో ఉన్న కుజుడు.

అయితే నిజానికి ఇక్కడ రుచక యోగం పని చేస్తున్నది కేవలం 10 శాతం మాత్రమే.

మిగిలిన 90 శాతం నీచపట్టిన కేతువు ఖాతాలోకి పోతోంది. ఆ కోణంలో గట్టి పరిహారాలు పాటించాలి. లేకపోతే వ్యాపారంలో నష్టాలకూ, భార్య ఆయుష్షుకూ కూడా దీని ప్రభావం సోకే ప్రమాదం ఏర్పడుతుంది.

13. 39 నుండి 55 మధ్య గురు దశ. భార్య పేరు మీద వ్యాపారం చేస్తే కలిసి రావడం జరుగుతుంది. చేసే వ్యాపారాలు... షేర్స్, స్పెక్యులేషన్, బ్రోకింగ్, మార్కెటింగ్, కమ్యూనికేషన్స్.

14. శని దశలో... అంటే 55 నుండి 74 మధ్య సివిల్ వర్క్స్, బిల్డింగ్ మెటీరియల్స్, రియల్ ఎస్టేట్... వీటికి సంబంధించిన వ్యాపారాలు చేయడం జరుగుతుంది... అది కూడా భార్య పేరు మీదనే.

15. బుధునిలో కేతుభుక్తిలో... అంటే 76వ సంవత్సరంలో... మరుజన్మకు చేసే మహాప్రస్థానం... అదీ ఒక తీర్థయాత్రలో!!!

ఈ వారం కథ

# శిశిరంలో వసంతం


రష్యన్ మూలం :
**కన్‌స్తన్‌తీన్ పస్తోవ్‌స్కీ**

తెలుగు అనువాదం :
**కేశవ్‌గోపాల్**


బొమ్మలు : **చారి పి.యస్.**

**తత్యాన ఆ ఇంట్లో చేరిన నెల రోజులకు ఇంటి యజమాని పతాపవ్ వృద్ధాప్యం వల్ల చనిపోయాడు. తత్యాన తన కూతురు వార్యాతో, వయసు మళ్ళిన ఆయాతో ఒంటరిగా మిగిలిపోయింది.**

**ఆ ఇల్లు చిన్నది. మూడే గదులు. నది పక్కన కొండపైన సరిగ్గా ఊరి చివర రోడ్డు పక్కన ఉంది. ఇంటి వెనక ఆకులు రాలిపోయిన ఒక తోట, తెల్లగా కనిపించే ఒక బర్చి తోపు ఉన్నాయి. తెల్లారింది మొదలు చీకటి పడేదాకా కాకులు కావు కావుమని గోలపెడుతూ మోడువారిన చెట్ల చిటారుకొమ్మల పైన చక్కర్లు కొట్టేవి.**

**చా**లాకాలం మాస్కోలో నివసించిన తత్యాన ఆ చిన్న ఊరికీ, అక్కడి చిన్న చిన్న ఇళ్ళకూ, కిర్రుమనే చప్పుళ్ళకూ, సందడి లేని సాయం సంధ్యలకూ, కిరసనాయిల్ దీపం చిటపటలకూ సులభంగా అలవాటు పడలేకపోయింది.

"ఎంత తెలివి తక్కువదాన్ని! అసలు మాస్కో వదిలిపెట్టి ఎందుకు వచ్చేశాను? నాటకశాలను, స్నేహితులను ఎందుకు వదులుకున్నాను? పుష్కినోలో ఎలాంటి విమాన దాడులు లేవు. వార్యాను అక్కడే వదిలిపెట్టి నేను మాస్కోలోనే ఉండిపోయుంటే బాగుండేది కదా! ఎంత మూర్ఖురాల్ని" అని వాపోయేది తత్యాన.

కానీ మాస్కోకు తిరిగి వెళ్ళడం ఇప్పుడు సాధ్యమయ్యే పని కాదు. ఆమె సైనిక ఆస్పత్రుల్లో మ్యూజిక్ షోలు ఇవ్వాలని నిర్ణయించుకుంది. అవి ఆ ఊర్లో కొన్ని ఉన్నాయి కదా అని మనసు కుదుటపర్చుకుంది. మెల్లమెల్లగా ఆ ఊరంటే ఇష్టం కూడా పెరగసాగింది - విశేషించి శీతాకాలం మొదలై - ఊరు మంచు దుప్పటి కప్పుకున్నప్పుడు. నిజానికి చలి అంత తీవ్రంగా లేదు. నది చాలాకాలం పాటు గడ్డకట్టలేదు. ఆకుపచ్చని నీటిపై ఆవిరి కమ్ముకుందంతే.

తత్యాన ఆ ఊరికీ, అలాగే తమది కాని ఆ పరాయింటికీ క్రమంగా అలవాటుపడసాగింది. శృతి తప్పిన పియానోకూ, గోడమీద వేలాడుతున్న వికారమైన తీరరక్షణ యుద్ధ నౌకల ఫోటోలకూ అలవాటుపడసాగింది. చనిపోయిన వృద్ధుడు - పతాపవ్ ఒకప్పుడు యుద్ధనౌకల్లో ఇంజనీరుగా పనిచేసేవాడు. ఆకుపచ్చని ఉన్ని వస్త్రం కప్పిన రాతబల్ల మీద గతంలో అతడు ప్రయాణం చేసిన యుద్ధనౌక 'గ్రమ్‌బోయ్' నమూనా ఉంది. ఆయన వార్యాను దాన్ని తాకనిచ్చేవారు కాదు; ఆ మాటకొస్తే ఏ వస్తువునూ తాకనిచ్చేవారు కాదు.

పతాపవ్‌కు ఒక కొడుకున్నాడు. పేరు నికలాయ్. నల్ల సముద్ర నౌకాదళంలో నావికుడుగా పనిచేస్తున్నాడు. ఈ విషయం తత్యానకు తెలుసు. యుద్ధనౌక నమూనా పక్కనే అతని ఫోటో కూడా ఉంది. ఆ ఫోటోను చేతిలోకి తీసుకున్నప్పుడల్లా ఆమె కనుబొమలు ముడిపడతాయి. ఏవో ఆలోచనల్లో మునిగిపోతుంది. తన వైవాహిక జీవితం విచ్ఛిన్నం కాకముందు చాలాకాలం కిందట అతణ్ణి ఎక్కడో కలుసుకున్నట్టు ఎప్పుడూ ఒక అనుభూతికి లోనౌతూ ఉంటుంది. కానీ... ఎక్కడ? ఎప్పుడు?

ఆ నావికుడు ప్రశాంతమైన చూపులతో ఆమెను ఆటపట్టిస్తున్నట్టుగా "నిజంగా జ్ఞాపకం రావడం లేదా?" అని అడుగుతున్నట్లనిపిస్తుంది.

"లేదు, జ్ఞాపకం రావడం లేదు!" మంద్రస్వరంతో జవాబిచ్చింది ఆమె.

"అమ్మా! నువ్వెవరితో మాట్లాడుతున్నావ్?" అని పక్క గదిలోంచి బిగ్గరగా అడిగింది ఆమె కూతురు వార్యా.

"పియానోతో!" జవాబుగా నవ్వింది తత్యాన.

శీతాకాలం ఆరంభమైన కొన్ని రోజులకు పతాపవ్ పేర ఒకే రకమైన చేతిరాతతో ఉత్తరాలు రావడం మొదలయింది. తత్యాన వాటన్నిటినీ పేర్చి బల్లమీద పెట్టింది. ఒకరోజు అర్ధరాత్రి ఆమెకు మెలకువొచ్చింది. కిటికీలోంచి చూస్తే మంచు మందంగా ప్రకాశిస్తోంది. పతాపవ్ పెంచుకున్న పిల్లి- అర్హీప్ సోఫా మీద గుర్రు పెడుతోంది.

తత్యాన బల్లమీద కొవ్వొత్తి వెలిగించింది. పడక కుర్చీలో కూచుని నిశ్చలంగా వెలుగుతున్న దీపశిఖను చాలాసేపు తదేకంగా చూసింది. తర్వాత జాగ్రత్తగా ఒక ఉత్తరం తెరిచి వెనక్కొకసారి దృష్టి సారించి చదవడం మొదలెట్టింది. "ప్రియమైన నాన్నా! నేనిప్పటికే నెల్లాళ్ళుగా ఆస్పత్రిలో ఉన్నాను. మరీ పెద్ద గాయమేమీ కాదు. మానిపోవస్తోంది. దయచేసి దిగులుపడొద్దు. సిగరెట్ మీద సిగరెట్ కాల్చొద్దు... వేడుకొంటున్నాను.

నువ్వు తరచుగా గుర్తొస్తున్నావు నాన్నా! మన ఇల్లు, మన ఊరు కూడా గుర్తొస్తున్నాయి..." తత్యాన చదవడం కొనసాగించింది.

"...అంతా ఎంతో దూరాన, ప్రపంచం అంచున ఉన్నట్టుంది. కళ్ళు మూసుకుంటే నాకేం కనిపిస్తోందో తెలుసా? నేనక్కడ గేటు తెరుస్తున్నాను. తోట లోపలికి నడుస్తున్నాను. శీతాకాలం... ఎక్కడ చూసినా మంచు కనిపిస్తోంది. కానీ కొండ చరియమీది పొదరింటి దాకా దారి శుభ్రంగా ఊడ్చినట్టుంది. లైలాక్ పూలపొదలను నూగు మంచు కప్పేసింది. ఇంటి గదుల్లోని పొయ్యిగూళ్ళలోంచి చిటపట శబ్దాలొస్తున్నాయి. బర్చ్ కొయ్య కాలుతున్న కమ్మని వాసన వస్తోంది. ఇన్నాళ్ళకు మళ్ళీ పియానో శృతి చేసినట్టుంది. నేను లెనిన్‌గ్రాడ్ నుంచి తెచ్చిన పసుపుపచ్చని కొవ్వొత్తులను సెమ్మెలలో పెట్టావు. పియానో మీద పాటల సంగీతస్వరాలు నోట్స్ రాసిన కాగితాలున్నాయి. తలుపు దగ్గర చిన్న గంట మోగుతోందా? దాన్ని బాగుచేయడానికి నాకు బొత్తిగా కుదర్లేదు. వాటన్నిట్నీ నేను మళ్ళీ చూడగలుగుతానా? ప్రయాణం చేసి వచ్చింతర్వాత కూజాలో నింపిన మన బావి నీళ్ళతో ఒళ్ళు కడుక్కోగలనా? నీకు గుర్తుందా? వాటన్నిటి పట్ల నాకెంత ఇష్టం కలుగుతోందో ఇంత దూరం నుంచీ తెలుసా? నమ్మలేకపోతున్నావా? యుద్ధభూమిలో అతి భయంకరమైన క్షణాలు ఎదుర్కొంటున్నప్పుడు నా మనసులో మెదిలేవి ఇవే... నాకు తెలుసు... నేను కాపాడుతున్నది కేవలం నా దేశాన్నే కాదు - నాకెంతో ప్రియమైన మన ఇంట్లో ప్రతి అంగుళాన్నీ, నిన్నూ, మన చింపిరిజుత్తు కుర్రాళ్ళనూ, నది వారగా ఉన్న బర్చ్ తోపులనూ, అర్హీప్ పిల్లిని కూడా. దయచేసి నవ్వొద్దు. కాదని తల అడ్డంగా ఊపొద్దు. నేను ఆస్పత్రి నుంచి బయటకు రాగానే ఇంటికి వెళ్ళే అవకాశముంది. కాని తప్పక వస్తానని మాత్రం ఆశపెట్టుకోవద్దు."

•••

సూర్యోదయం కావస్తోంది. ఆకాశంలో ముదురు నీలం రంగు అలుముకుంది. తత్యాన కళ్ళు విప్పార్చి ఆ దృశ్యాన్ని చూస్తూ బల్ల దగ్గరే చాలాసేపు కూచుండిపోయింది. యుద్ధ రంగం నుంచి ఏ రోజైనా ఆ కొత్త వ్యక్తి ఇంటికి రావచ్చుననీ, సొంత ఇంట్లో పరాయి మనుషులుండడం చూసినప్పుడు - పైగా తను ఊహించినట్లు కాక, ఇంట్లో అన్నీ తారుమారై ఉండడం కనిపిస్తే అతని మనసుకు బాధ కలగవచ్చనీ తత్యానకు అనిపించింది.

**... కళ్ళు మూసుకుంటే నాకేం కనిపిస్తోందో తెలుసా? నేనక్కడ గేటు తెరుస్తున్నాను. తోట లోపలికి నడుస్తున్నాను. శీతాకాలం... ఎక్కడ చూసినా మంచు కనిపిస్తోంది. కానీ కొండ చరియమీది పొదరింటి దాకా దారి శుభ్రంగా ఊడ్చినట్టుంది. లైలాక్ పూలపొదలను నూగు మంచు కప్పేసింది. ఇంటి గదుల్లోని పొయ్యిగూళ్ళలోంచి చిటపట శబ్దాలొస్తున్నాయి. బర్చ్ కొయ్య కాలుతున్న కమ్మని వాసన వస్తోంది. ఇన్నాళ్ళకు మళ్ళీ పియానో శృతి చేసినట్టుంది. నేను లెనిన్‌గ్రాడ్ నుంచి తెచ్చిన పసుపుపచ్చని కొవ్వొత్తులను సెమ్మెలలో పెట్టావు...**

మరుసటిరోజు, కొండచరియ మీది పొదరింటి దాకా పార తీసుకుని దారి శుభ్రం చేయమని వార్యాను పురమాయించింది తత్యాన. పొదరిల్లు బాగా శిథిలావస్థలో ఉంది. దానికి వాడిన కొయ్యసామానంతా దాదాపు పాతబడిపోయి నాచు మొక్కలతో నిండిపోయి ఉంది. తర్వాత తత్యాన స్వయంగా తానే తలుపు దగ్గరి గంటను బాగుచేసింది. దానిపైన తమాషాగా "నేను తలుపు దగ్గరే వేలాడుతున్నాను. సంతోషంగా మోగించండి" అనే మాటలు చెక్కి ఉన్నాయి. తత్యాన ఆ గంటను తాకగానే అది ఖంగుమని మోగింది. పిల్లి - అర్హీప్ చిరాగ్గా చెవులు విదిలించి ముందు గదిలోకి వెళ్ళిపోయింది. గంట శబ్దం దానికి నచ్చలేదు.

మధ్యాహ్నం జేవురించిన చెక్కిళ్ళతో అలసిన కళ్ళతో హడావుడిపడుతూ తత్యాన పట్నం నుంచి పియానో శృతిచేసే మనిషిని వెంటబెట్టుకొచ్చింది. అతను రష్యాలో స్థిరపడిన 'చెక్' జాతీయుడు. పియానోలనే గాక అనేక రకాల ఇతర వస్తువులను కూడా బాగు చేయగలడు. అతని పేరు తమాషాగా ఉంది. 'నివిదాల్'... అంటే 'ఇంతకుముందెప్పుడూ చూడనిది' అని రష్యన్‌లో అర్థం. అతడు పియానో బాగుచేసిన తర్వాత "పాతదేగానీ చాలా నాణ్యమైనద"ని చెప్పాడు. అతడు చెప్పకపోయినా ఆ విషయం ఆమెకు తెలుసు.

అతడు వెళ్ళిపోయిన తర్వాత ఆమె బల్ల సొరుగులన్నీ జాగ్రత్తగా వెదికింది. లావాటి కొవ్వొత్తులున్న ప్యాకెట్ కనిపించింది. వాటిని పియానో మీది సెమ్మెలలో అమర్చింది. సాయంత్రం కొవ్వొత్తులు వెలిగించి పియానో ముందు కూచుంది. ఇల్లంతా సంగీత సుస్వరాలు వెల్లువెత్తాయి.

కాసేపటి తర్వాత ఆమె పియానో వాయించడం ఆపి కొవ్వొత్తులను ఆర్పేసింది. క్రిస్మస్ చెట్టు దగ్గర వెలిగించిన కొవ్వొత్తుల్లాగా గదిలో కమ్మటి వాసన కమ్ముకుంది.

"నీవి కాని వస్తువులను ఎందుకు ముట్టుకుంటావ్? నన్నయితే అసలు ముట్టుకోనీవు. నువ్వు మాత్రం - గంట, కొవ్వొత్తులు, పియానో - అన్నిట్నీ ముట్టుకుంటున్నావు. పరాయివాళ్ళ సంగీత స్వరాల పాఠాలను కూడా పియానో మీద పెట్టావు" అని వార్యా తల్లితో అంది.

"ఎందుకంటే నేను పెద్దదాన్ని కాబట్టి" తత్యాన జవాబిచ్చింది.

వార్యా భృకుటి ముడిపడింది. నమ్మలేనట్టుగా తత్యాన వైపు చూసింది. ఆ క్షణంలో తత్యాన ఏ మాత్రం పెద్దదానిలా కనిపించలేదు. శరీరమంతా మెరుస్తూ చూడ్డానికి రాజసౌధంలో గాజు పాదరక్ష పారేసుకున్న బాలికలా, అపరంజి కురులతో మెరుస్తున్న బాలికలా కనిపించింది. అలాంటి బాలిక గురించి స్వయంగా తత్యానయే వార్యాకు చెప్పింది ఒకప్పుడు.

•••

నికలాయ్ రైల్లో వస్తూ ఆలోచనలో పడ్డాడు. నాన్నగారి దగ్గర కొద్ది గంటల కంటే ఎక్కువ సమయం ఉండలేను. ఎక్కువ రోజులు సెలవు లేదు. ప్రయాణమే

కాలమంతా మింగేసింది అనుకున్నాడు.

ఊర్లో రైలు ఆగగానే అతనికి తెలిసిన స్టేషన్ మాస్టర్ పలకరించాడు. నెల రోజుల క్రితమే తండ్రి చనిపోయాడనీ, మాస్కో నుంచి వచ్చిన ఒక యువ గాయని తన కూతురుతో ఆ ఇంట్లో స్థిరపడిందనీ, ఆమె నిర్వాసితురాలనీ చెప్పాడు.

నికలాయ్ చాలాసేపు కిటికీలోంచి చూస్తూ మౌనంగా ఉండిపోయాడు. లావాటి కోట్లు వేసుకుని, ఫెల్ట్ బూట్లు ధరించి, చేతుల్లో టీ-కెటిళ్ళు పట్టుకుని పరుగులు పెడుతున్న ప్రయాణికులు కనిపించారు. అతనికి తల గిర్రున తిరుగుతున్నట్టనిపించింది.

"మీ నాన్న మంచి మనసున్న మనిషి. పాపం నిన్ను కలుసుకోకుండా, చివరి చూపులకు నోచుకోకుండానే వెళ్ళిపోయాడు" చెప్పాడు స్టేషన్ మాస్టర్.

"మళ్ళీ వెనక్కెళ్ళడానికి ఎప్పుడుంది రైలు?" అడిగాడు నికలాయ్.

"తెల్లవారుఝామున ఐదు గంటలకు" జవాబిచ్చాడు స్టేషన్ మాస్టర్. కాస్సేపు నిశ్శబ్దం... "నాతో పాటు ఇక్కడే ఉండు. మా ఆవిడ నీకు టీతో పాటు తినడానికేమైనా తెచ్చిపెడుతుంది. మీ ఇంటికెళ్ళినా అక్కడ 'నా' అనే వాళ్ళెవరూ లేరు కదా!" సలహా ఇచ్చాడు.

"థాంక్స్!" అంటూ నికలాయ్ స్టేషన్ బయటకు నడిచాడు. అతడు తల ఊపుతూ నడుస్తూ వెళ్ళడం గమనించాడు స్టేషన్ మాస్టర్.

నికలాయ్ ఊరిలో గుండా నది వైపు నడిచాడు. నది మీది ఆకాశంలో బూడిద, నీలం రంగులు సమ్మిశ్రితమైన మబ్బులు ముసురుకుని ఉన్నాయి. ఆకాశం నుంచి భూమికి నిచ్చెన వేస్తున్నట్టు మంచుతరకలు ఏటవాలుగా రాలుతున్నాయి. దారి పొడవునా కాకులు ఎగురుతూ కనిపించాయి. చీకటి పడుతోంది. నదికి ఆవలిగట్టునున్న అడవి నుంచి వీచే బలమైన గాలి అతని కన్నీటిని చెదరగొడుతోంది.

"ఏం చేస్తాం... చాలా ఆలస్యమైపోయింది. ఇప్పుడీ ఊరు, ఈ నది, మా ఇల్లు... అన్నీ పరాయివైపోయాయి" అనుకున్నాడు మనసులో నికలాయ్.

అతను వెనక్కు తిరిగి ఊరికి ఆవలున్న కొండ చరియను చూశాడు. అక్కడ నూగు మంచులో నిండిన తోట, అందులో ఇల్లు మసక మసగ్గా కనిపిస్తున్నాయి. చిమ్నీ నుంచి పొగ పైకి లేచి బర్చి తోపు వైపు వ్యాపిస్తోంది.

నికలాయ్ నెమ్మదిగా ఇంటివైపు నడిచాడు. ఇంట్లోకి వెళ్ళకూడదని ముందే నిర్ణయించుకున్నాడు. తోటలోంచి గబగబా నడుస్తూ పొదరింటి దగ్గరకు వెళ్ళి అక్కడ కాస్సేపు నిల్చుని తిరిగి వెళ్ళిపోవాలనుకున్నాడు. పరాయివాళ్ళు తమ ఇంట్లో తిష్ట వేశారనే ఆలోచనే భరించలేకపోతున్నాడు. దేన్నీ చూడకుండా, గుండె పుండుపై ఇంకొంచెం కారం చల్లకుండా అక్కణ్ణుంచి వెళ్ళిపోవడం, గతాన్ని శాశ్వతంగా మర్చిపోవడం మంచిదనుకున్నాడు.

"వయసు పెరిగే కొద్దీ మనిషికి తన చుట్టూ ఉన్న ప్రతిదాని పట్ల కాఠిన్యం పెంచుకుంటాడేమో!" అనిపించింది నికలాయ్‌కు.

ముని చీకట్లో నికలాయ్ ఇంటిని సమీపించాడు. జాగ్రత్తగా గేటు తెరిచాడు. అయినా అది కిర్రుమంది. తోటంతా ఒక్కసారిగా ఉలిక్కిపడినట్లనిపించింది. చెట్ల కొమ్మల మీది మంచు సరసరమంటూ నేల రాలింది. నికలాయ్ శరీరం కంపించింది. చుట్టూ కలయజూశాడు. మంచు శుభ్రంగా తొలగించిన దారి వెంట నడుస్తూ



పొదరింటిని సమీపించి కాలదోషం పట్టిన ఇనుపకమ్మీ మీద చెయ్యి వేశాడు. దూరంగా అడవికి ఆవల ఆకాశం అస్పష్టంగా రోజారంగు పులుముకుంటోంది - బహుశా మబ్బుల మాటున చంద్రోదయమౌతున్నట్టుంది. నికలాయ్ టోపీ తీసి చేత్తో తల నిమురుకున్నాడు. చుట్టూ నిశ్శబ్దం పరుచుకుని ఉంది. ఎక్కడో కొండ దిగువన మంచు బొరియల్లోంచి నీళ్ళు తోడుకోవడానికి వెళ్ళిన ఆడవాళ్ళ బకెట్లు చేసే దడబడలు మాత్రం లీలగా వినిపిస్తున్నాయి.

నికలాయ్ ఇనుపకమ్మీకి ఆనుకుని "ఇదంతా ఎలా జరిగింది?" అనుకున్నాడు మనసులో.

ఉన్నట్టుండి అతని భుజం మీద మెల్లగా ఎవరో చెయ్యి వేశారు. వెనక్కు తిరిగి చూశాడు. బాగా పాలిపోయిన ముఖంతో ఒక స్త్రీమూర్తి నిల్చుని ఉంది. తలచుట్టూ వెచ్చని శాలువా కప్పుకుని ఉంది. ఆమె మౌనంగా తదేక దృష్టితో అతని కేసి చూస్తోంది. చెట్ల కొమ్మల మీది నుంచి రాలిన మంచు ఆమె కనురెప్పల మీద, చెక్కిళ్ళ మీద పడి జారిపోతోంది.

"టోపీ పెట్టుకోండి. లేకపోతే జలుబు చేస్తుంది. ఇక్కడ ఎక్కువసేపు నిల్చోకూడదు" అందామె మృదువుగా.

నికలాయ్ కాస్సేపు మౌనంగా ఉండిపోయాడు. ఆమె అతని కోటు చేయి పట్టుకుని ఇంటివైపు దారి తీసింది. నికలాయ్ వరండా దగ్గర ఆగాడు. అతనికి గొంతులో ఏదో అడ్డం పడినట్టు అనిపించింది. ఊపిరి తీసుకోవడం కష్టంగా ఉంది.

"దయచేసి మొహమాటపడకండి. కాసేపట్లో మీ ఇబ్బందంతా మాయమైపోతుంది" అందామె అదే మృదుస్వరంతో.

బూట్లకు అంటుకున్న మంచు రాలిపోడానికి ఆమె కాళ్ళు విదిల్చింది. గుమ్మం దగ్గరున్న గంట గణగణ మోగింది. నికలాయ్ దీర్ఘంగా శ్వాస తీసుకున్నాడు.

అతడు ఏదో అస్పష్టంగా గొణుగుతూ ఇంట్లోకి అడుగుపెట్టాడు. ఓవర్ కోటు విప్పాడు. బర్చి చెక్క పొగవాసన ముక్కు పుటాలను తాకింది. పిల్లి అర్చీప్ కంటబడింది. అది ఆవులిస్తూ సోఫాలో కూచుని ఉంది. సోఫా పక్కనే రెండు జడలున్న అమ్మాయి నవ్వు మొహంతో అతని భుజం మీది బంగారు చారల పట్టీలను చూసింది.

"లోపలికి రండి" అంటూ తత్యాన నికలాయ్‌తో వంటగదిలోకి నడిచింది.

ఒక కూజాలో చల్లని బావినీళ్ళున్నాయి. ఓకు ఆకులు ఎంబ్రాయిడరీ చేసిన, అతనికి చిరపరిచితమైన తువ్వాలు అందుబాటులో వేలాడేసి ఉంది.

తత్యాన బయటకు వెళ్ళింది. వార్యా అతని కోసం సబ్బు తీసుకొచ్చింది. అతను చొక్కా తీసేసి ఒళ్ళు కడుక్కోవడం గమనిస్తూ నిల్చుంది. అతని తత్తరపాటు ఇంకా తగ్గలేదు.

"మీ అమ్మ ఏం చేస్తుంది?" అని వార్యాను అడిగాడు. అతడాప్రశ్న ఏదో ఒకటి మాట్లాడాలనే ఉద్దేశంతో మాత్రమే అడిగాడు.

"మా అమ్మ తాను చాలా పెద్దదాన్నయిపోయాననుకుంటోంది. కానీ

బొత్తిగా కాదు. చిన్నపిల్ల కంటే అధ్వాన్నం-నాలాగా!" అంది రహస్యం చెప్తున్నట్లు గుసగుసగా వార్యా.

"ఎందుకని?" అడిగాడు నికలాయ్.

ఆ అమ్మాయి జవాబేమీ ఇవ్వకుండా గలగలా నవ్వుతూ వంటగదిలోంచి తుర్రుమంది.

మెలకువగా ఉన్నట్టు, అదే సమయంలో గాఢనిద్రలో ఉన్నట్టు ఒక చిత్రమైన అనుభూతి నికలాయ్‌ను వెంటాడింది. ఇంట్లో ప్రతి వస్తువూ ఎక్కడిదక్కడ తను ఎలా చూడాలనుకున్నాడో అలాగే ఉంది. పియానో మీద సంగీత స్వరాల పాఠాలున్నాయి. ఒకప్పుడు తను తెచ్చిన కొవ్వొత్తులే చిటపట శబ్దం చేస్తూ తన తండ్రిగారి స్టడీరూంలో కాంతి ప్రసరిస్తున్నాయి. తను ఆస్పత్రి నుంచి రాసిన ఉత్తరాలు కూడా బల్లమీద పాత కంపాస్ పరికరం అడుగున ఉన్నాయి. ఆయన ఉత్తరాల్ని ఎప్పుడూ అలాగే పెట్టేవాడు.

టీ తాగిన తర్వాత తత్యాన అతణ్ణి తోటలో మరోవైపున్న అతని తండ్రి సమాధి దగ్గరకు తీసుకెళ్ళింది. అప్పటికే ఆకాశంలో చంద్రుడు బాగా ఎత్తుకు వచ్చాడు. ఆ వెలుగులో ఫర్ చెట్లు మసక మసగ్గా కనిపిస్తున్నాయి. మంచు మీద నీడలు అస్పష్టంగా కదులుతున్నాయి.

తిరిగి ఇంట్లోకి వచ్చాక తత్యాన పియానో ముందు కూచుని దాని మెట్లను సుతారంగా తన వేళ్ళతో నొక్కుతూ నికలాయ్ వైపు దృష్టి సారించి "మిమ్మల్ని ఇదివరకే ఎక్కడో చూసినట్టు అనిపిస్తుంటుంది నాకు ఎప్పుడూ" అంది.

"బహుశా చూశారేమో" అంటూ నికలాయ్ ఆమెకేసి చూశాడు. కొవ్వొత్తి కాంతి ఆమె ముఖం మీద పడి సగం మేర ప్రకాశిస్తోంది.

తర్వాత నికలాయ్ లేచి గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తూ "లేదు, నాకు జ్ఞాపకం లేదు!" అన్నాడు హీనస్వరంతో.

తత్యాన వెనక్కు తిరిగి భయపడుతున్నట్లుగా అతనికేసి చూసింది. కానీ ఏమీ జవాబు చెప్పలేదు.

అతనికి తన తండ్రి స్టడీరూంలో సోఫామీద పడక ఏర్పాటు చేశారు. కానీ, నికలాయ్‌కి నిద్ర రావటం లేదు. ఆ ఇంట్లో గడుపుతున్న ప్రతి క్షణం ఎంతో విలువైనదిగా అనిపించింది. ఆ అనుభూతిని వృథాగా పోనివ్వకూడదనుకున్నాడు.

పిల్లి అర్ఖీప్ అడుగుల చప్పుడు, టక్ టక్ మనే గడియారం సవ్వడి, మూసిన తలుపు వెనక ఆయాతో తత్యాన స్వరం తగ్గించి మాట్లాడడం వింటూ ఉండిపోయాడు నికలాయ్. తర్వాత వాళ్ళ మాటలు ఆగిపోయాయి. ఆయా వెళ్ళిపోయింది. కానీ, తలుపు సందులోంచి పడుతున్న వెలుతురు చార మణిగిపోలేదు. పుస్తకం పేజీలు రెపరెపమంటున్నాయి. బహుశా తత్యాన ఏదో పుస్తకం చదువుతున్నట్టుంది. ఉదయం రైలు వచ్చేవేళకు ముందే తనను నిద్ర లేపడానికి ఆమె మేలుకుని ఉన్నట్టు నికలాయ్ ఊహించాడు. తాను కూడా నిద్రపోవడం లేదని ఆమెకు చెప్పాలనుకున్నాడు. కానీ, ఆమెను పిలవాలా వద్దా అని నిర్ణయించుకోలేకపోయాడు.

తెల్లవారుఝాము నాలుగు గంటలకు తత్యాన మెల్లగా తలుపు తెరిచి అతణ్ణి పిలిచింది. అతడు సోఫాలో ఒత్తిగిలాడు.

"మీకు వేళయింది. మిమ్మల్ని నిద్రలేపుతున్నందుకు చాలా విచారంగా ఉంది" అందామె.

ఊరంతా గాఢనిద్రలో ఉంది. తత్యాన నికలాయ్ వెంట స్టేషన్‌కు వెళ్ళింది. రైలు బయల్దేరడానికి రెండో గంట మోగింది. ఇద్దరూ ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకున్నారు. తత్యాన రెండు చేతులూ బారజాపి నికలాయ్‌కేసి చూస్తూ అంది.

**నికలాయ్‌కి నిద్ర రావటం లేదు. ఆ ఇంట్లో గడుపుతున్న ప్రతి క్షణం ఎంతో విలువైనదిగా అనిపించింది. ఆ అనుభూతిని వృథాగా పోనివ్వకూడదనుకున్నాడు. పిల్లి అర్ఖీప్ అడుగుల చప్పుడు, టక్ టక్ మనే గడియారం సవ్వడి, మూసిన తలుపు వెనక ఆయాతో తత్యాన స్వరం తగ్గించి మాట్లాడడం వింటూ ఉండిపోయాడు నికలాయ్. తర్వాత వాళ్ళ మాటలు ఆగిపోయాయి. ఆయా వెళ్ళిపోయింది. కానీ, తలుపు సందులోంచి పడుతున్న వెలుతురు చార మణిగిపోలేదు. పుస్తకం పేజీలు రెపరెపమంటున్నాయి.**

"ఉత్తరం రాయండి. మనమిప్పుడు బంధువులమనిపిస్తోంది, కాదా?"

నికలాయ్ జవాబు చెప్పకుండా తలూపాడు.

కొన్ని రోజుల తర్వాత తత్యానకు ఒక ఉత్తరం వచ్చింది. ప్రయాణంలో ఉండగానే నికలాయ్ రాసిన ఉత్తరమది.

"మనం ఎక్కడ కలుసుకున్నామో నిజానికి నాకు గుర్తుంది. కాని ఆ విషయం మీకు ఇంటి దగ్గర చెప్పాలనిపించలేదు. 1927వ సంవత్సరంలో క్రిమియా గుర్తుందా మీకు? ఆకురాలు కాలం... లివదీస్కియ్ పార్కులో... ఏ కాలంనాటివో ప్లేన్ వృక్షాలు... తేజోహీనమౌతున్న ఆకాశం... వివర్ణమౌతున్న సముద్రం... నేను దారివెంట అరియాంద్రకు నడుచుకుంటూ వెళ్తున్నాను. దారి పక్కన బెంచీ మీద ఒక అమ్మాయి కూచుని ఉంది. సుమారు పదహారేళ్ళుంటాయి. నన్ను చూసి లేచి ఎదురుగా వచ్చింది. మేము ఒకరికొకరం దగ్గరయ్యాక నేనామె ముఖం చూశాను. చేతిలో తెరిచిన పుస్తకం పట్టుకుని ఆమె వడివడిగా నన్ను దాటి వెళ్ళింది. నేను నిలబడి అంతకంతకూ దూరమౌతున్న ఆమె మూర్తిని చాలాసేపు చూస్తుండిపోయాను. ఆ అమ్మాయే మీరు. నేను ఏమాత్రం పొరబడటం లేదు. మీరు వెళ్తూ ఉండటం చూస్తూ- నన్ను దాటిపోయిన ఈ అమ్మాయి 'నా జీవితాన్ని సర్వనాశనమైనా చేయొచ్చు లేదా అపారమైన సంతోషాన్నయినా తీసుకురావచ్చు' అనుకున్నాను మనసులో. నా సర్వస్వాన్ని అర్పించి అయినా ఆమెను ప్రేమించగలననే భావం నా మదిలో అంకురించింది. మీరెవరో, ఎక్కడుంటారో తెలుసుకుని తీరాలని అప్పుడే నిర్ణయించుకున్నాను. కానీ, అక్కడే స్థాణువులా నిల్చుండిపోయాను. ఎందుకో తెలీదు. ఆనాటినుంచి క్రిమియానూ, లిప్తపాటు మాత్రమే చూసి మిమ్మల్ని శాశ్వతంగా పోగొట్టుకున్న ఆ చోటునూ, ఆ దారినీ ఎంతగానో ప్రేమించాను. కానీ, జీవితమే స్వయంగా నన్ను కరుణించింది. మిమ్మల్ని కలుసుకున్నాను. అంతా సవ్యంగా సాగిపోతే, నా జీవితం మీదని భావిస్తే- నిజానికి మీదే అవుతుంది. అన్నట్టు కవరు చింపి తెరిచిన నా ఉత్తరం మా నాన్నగారి బల్లమీద కనిపించింది. నాకంతా పూర్తిగా అర్థమైంది. నేను మీకు దూరం నుంచి కృతజ్ఞతలు మాత్రమే చెప్పగలను..."

తత్యాన ఉత్తరం చదవడం ముగించి పక్కన పెట్టింది. చెమ్మగిల్లిన కళ్ళతో కిటికీ వెలుపలి హిమాచ్ఛాదిత వృక్షవాటికను చూస్తూ మనసులో అనుకుంది.

"అయ్యో! నేను ఒక్కసారంటే ఒక్కసారైనా క్రిమియాకు వెళ్ళనేలేదే! కానీ, ఇప్పుడా విషయానికి ప్రాముఖ్యమేమైనా ఉందా? ఇప్పుడతని భ్రమను తొలగించడం సమంజసమా? ఇక నా భ్రమ సంగతీ...?

ఆమె అరచేతుల్తో ముఖం కప్పుకుని నవ్వింది. కిటికీ బయట సూర్యుడు 'అస్తమిద్దామా వద్దా?' అన్నట్టు మందంగా కాంతి ప్రసరిస్తున్నాడు...!!

..........................................................................

**అనువాదకుని సెల్ : 94409 77192**

## ఇవీ వచ్చాయి

**పద్మశాలి** (మనుగడ కోసం పోరాటం)
**పేజీలు :** 118, **వెల :** రూ.100

**పోచంపల్లి ఇక్కత్**
(చిటికి పరిశ్రమ అభివృద్ధి - సవాళ్ళు)
**పేజీలు :** 32, **వెల :** రూ.50
**రచన :** తడ్క యాదగిరి
**ప్రతులకు :** 93480 09227

---

**ధనక్** (ఇంద్రధనుస్సు)
**కథ, స్క్రీన్‌ప్లే :** నగేష్ కుకునూర్
**నవలీకరణ :** అనుష్కా రవిశంకర్
**పేజీలు :** 112, **వెల :** రూ.70

**ఆటలు, కథలు, డ్రామాలు, పాటలు, క్రాఫ్ట్ పిల్లలకు ఎందుకు?**
**రచన :** వై. మాలతీకృష్ణ
**పేజీలు :** 40, **వెల :** రూ.20

**మహానగరం**
**రచన :** ఎన్. మురళీధర్
**పేజీలు :** 120, **వెల :** రూ.65
**ప్రతులకు :** 94907 46614

---

**సంతరావూరు** (కథలు)
**రచన :** టి. వేంకట నారాయణ
**పేజీలు :** 118, **వెల :** రూ.60

**తెలంగాణ విస్మృత వీరుడు కేవల్ కిషన్**
**రచన :** బెల్లంకొండ సంపత్‌కుమార్
**పేజీలు :** 48, **వెల :** రూ.40

**సినారె సాహితీ ప్రాభవం**
(ప్రసంగ వ్యాస సంకలనం)
**పేజీలు :** 134, **వెల :** రూ.100
**ప్రతులకు : ప్రముఖ పుస్తక కేంద్రాలు**

---

**చేపలు - ఉపాధి**
**రచన :** బి. లక్ష్మప్ప
**పేజీలు :** 276, **వెల :** రూ. 300
**ప్రతులకు :** 96767 97777

---

**అశ్వరభ శరభ** (నాటకం)
**రచన :** ఎన్నెస్ నారాయణ బాబు
**పేజీలు :** 62, **వెల :** రూ. 150
**ప్రతులకు :** 90529 50208

---

**పెనుకొండ ప్రాచీన చరిత్ర**
**రచన :** కరణం సత్యనారాయణరావు
**పేజీలు :** 156, **వెల :** రూ.50
**ప్రతులకు :** శ్రీమతి కె. త్రిపుర, ఇం. నెం. 4-2-235, డి.బి. కాలనీ, హిందుపూర్-515201

## కొత్త పుస్తకాలు

# తెలంగాణ చరిత్రకు దిక్సూచి

'తెలంగాణ చరిత్ర సంస్కృతి వారసత్వం' శీర్షికతో వై.వై. రెడ్డి యానాల 'స్వచ్ఛ' తెలుగులో రాసిన 430 పేజీల గ్రంథం దాదాపు నాలుగు వేల ఏళ్ల తెలంగాణ చరిత్రను తరచి చూస్తుంది. చరిత్రలో తెలంగాణ ప్రాంత ప్రస్తావన జరిగిన నాటి నుంచి తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన 2014 జూన్ 2 వరకూ వివిధ పరిణామాలను శోధించి, ఆయన తన గ్రంథంలో సోదాహరణంగా ఉటంకించారు. అయితే చారిత్రక పూర్వ యుగం గురించి సూక్ష్మంగా చర్చించిన రెడ్డి యానాల, ఆ తర్వాత నాలుగు వేల ఏళ్ల చరిత్రను మాత్రం స్థూలంగా తడిమారు. ఆంధ్ర ప్రాంత వలసదార్లు తమ చరిత్ర, సంస్కృతి, వారసత్వాలను మహోన్నత శిఖరాలకు ఎక్కించి, తెలంగాణ చరిత్రకు మాత్రం మసిపూసే ప్రయత్నం చేశారని, తన చరిత్ర పరిశోధనలో ఈ వాస్తవం అడుగడుగునా కళ్లకు కట్టిందని ఆయన 'ముందుమాట'లో ఆవేదన వ్యక్తం చేశారు.




తెలంగాణ రాష్ట్ర సమగ్ర చరిత్రను తెలుసుకోకుండా రాష్ట్ర భవిష్యత్తును నిర్మించుకోవడం అసాధ్యమన్న ఏకైక లక్ష్యంతో ఆయన ఈ చరిత్ర పరిశోధనకు నడుం బిగించారు. తాజా పరిశోధనలను, తాజా తవ్వకాలను కూడా ఆయన తన పరిశోధనకు ఆలంబన చేసుకున్నారు. ఆయన అధ్యయనం చేసిన గ్రంథాల జాబితా కూడా అసాధారణమైంది. ఈ గ్రంథం పరిశోధకులకు సైతం మార్గదర్శకం.

**- జి. రాజశుక**

**తెలంగాణ చరిత్ర సంస్కృతి వారసత్వం**
(చారిత్రక పూర్వ యుగం నుండి ఆధునిక యుగం 2014 జూన్ 2 వరకు)
వై.వై. రెడ్డి యానాల
**పేజీలు :** 430, **వెల :** రూ.399, **ప్రతులకు :** రచయిత ఫోన్: 73965 86170

---

# హాస్య మరమరాలు




'నేను మన్మథుడిలా పంచబాణుడ్ని కాలేకపోయినా 'పంచ్'బాణుడ్ని కావాలని ఈ 'శంకరాలు' రాశాను' అంటారు రచయిత. లోకోక్తి సామెతలకే నగిషీలు అద్ది, హాస్యపానకంలో ముంచి, పేరడీల రూపంలో మళ్లీ మనకే అప్పగించారు. మచ్చుకు 'తినగ తినగ స్కాము తియ్యనుండు'; 'పెళ్లి చేసి చూడు ఒకప్పటి సవాల్ - పెళ్లి చేసుకొని చూడు ఇప్పటి సవాల్' .. లాంటివెన్నో. దాదాపు నాలుగువందల శంకరాలివి. మరమరాల్లా తింటూ హాయిగా నవ్వుకోవచ్చు.

**శంకరాలు**, శంకరనారాయణ, **పేజీలు :** 108, **వెల :** రూ.36, **ప్రతులకు :** 94919 62759

---

# ఎందరో కథానాయికలు

'స్త్రీ వాదం'తో రాసిన కథలు మనకు చిరపరిచితమే. అందులో మళ్ళీ రెండు రకాలు. మగాడి అకృత్యాలను ఎండగట్టేవి కొన్ని. నిర్ణయాధికారం సహా అన్నింటినీ స్వేచ్ఛగా అనుభవించే మహిళల ఇతివృత్తాలు మరికొన్ని. ఇందులో రెండో రకానికి చెందిన ఎక్కువ కథలు ఉన్న సంపుటి ఇది. ఆత్మవిశ్వాసం, స్వయం నిర్ణయం ఎప్పుడూ మంచే చేస్తుందని చెప్పలేం. ఒక్కోసారి వ్యతిరేక ఫలితాలనూ ఇవ్వొచ్చు! ఈ కథల విషయంలో రచయిత్రి మరో ప్రయోగం కూడా చేశారు. ప్రధాన స్త్రీ పాత్రలను స్వేచ్ఛగా నడుచుకోనిస్తూనే ఆ క్రమంలో తప్పులు దొర్లితే వాళ్ళు ఆ ఫలితాలను అనుభవిస్తారన్న నగ్నసత్యాన్ని కూడా కళ్ళకు కట్టేలా చూపించారు. ఈ స్త్రీలలో కొందరు తెలివిగా ముందుకెళితే, మరికొందరు తప్పటడగేస్తారు. ఈ కథల్లో మాన్యత, శ్రీజ, దివ్యాంగురాలు పౌర్ణమి మొదటి కోవకు చెందుతారు. రెండో తరహాకు చెందిన గౌతమి, నీల, రుక్మిణి ఇబ్బంది పడాల్సి వస్తుంది. అలాగే 'చందమామ బిస్కత్తు' అద్భుతమైన కథ. అయితే దీనిలో కీలకమైన తెరవెనుక కథ ఒకటికి రెండుసార్లు చదివితే కాని అర్థం కాదు. కొన్ని కథలు అంత వాసి గలవి కావు. సంకలనంగా వేసేటపుడు పట్టు ఉన్న కథలనే ఎంపిక చేసుకుని ఉంటే బాగుండేది.




**- మద్దిపట్ల మణి**

**ఆకాశమల్లి**, మండువ రాధ
**పేజీలు :** 184, **వెల :** రూ.140, **ప్రతులకు :** విశాలాంధ్ర, విజయవాడ.



# ఊరంతా నలభీములే!

రుచికరంగా వంట వండిన మగవాళ్లను నలుడని, భీముడని అంటాం. పుదిచ్చేరికి 30 కి.మీ.ల దూరంలో ఉన్న 'కలయూర్' గ్రామంలో అలాంటి నలభీములు ప్రతి ఇంట్లోనూ ఒకరిద్దరు ఉంటారంటే నమ్ముతారా! ప్రముఖ ఇంటర్నేషనల్ చానల్ 'హిస్టరీ 18' వారి మీద ఒక డాక్యుమెంటరీ తీసి ప్రసారం కూడా చేసింది కాబట్టి మనం నమ్మి తీరాల్సిందే.

80 పెంకుటిళ్లు మాత్రమే ఉండే కలయూర్‌లో 200 మంది దాకా వంటవాళ్లు ఉన్నారట. కలయూర్‌గా కంటే అదిప్పుడు వంటవాళ్ల ఊరుగా ఎక్కువ ప్రసిద్ధి చెందింది. 3గంటల్లోనే పదివేలమందికి భోజనాలకు సిద్ధం చేయడం ఈ గ్రామం వంటవాళ్ల ప్రత్యేకత. అందుకే దక్షిణ భారతదేశంలో 'కలయూర్' వంటవారికి చాలా డిమాండ్ ఉంటుంది. ఎంత అంటే ఏదైనా కార్యక్రమానికి వీరి చేత వండించుకోవాలంటే కొన్ని నెలల ముందే బుక్ చేసుకోవాల్సి ఉంటుంది.

"ఏ మాత్రం అలసిపోకుండా 3 గంటల్లోనే పదివేల మందికి వండి పెడతాం. చేసిన పనినే చేస్తూ ఉంటే బోర్ కొడుతుందని చాలామంది అంటారు. కాని మాకు మాత్రం ఎన్ని ఏళ్ల నుంచి వంటలు చేస్తున్నా మళ్లీ ఆర్డర్ రాగానే కొత్త ఉత్సాహం వస్తుంది" అని చెప్పారు 72 ఏళ్ల రామస్వామి కృష్ణస్వామి బలరామన్. బలరామన్ ఈ గ్రామంలోని వంటవాళ్లందరికీ పెద్ద.

ఆర్డర్ వస్తే ఎంత దూరమైనా వెళ్లి వంట చేసొస్తారు వీళ్లు. ఇప్పటికే దక్షిణ భారతదేశాన్నంతా చుట్టేసింది ఈ కలయూర్ వంట బృందం. ఎంత దూరమైనా వస్తున్నారు అంటే డబ్బులు బాగా డిమాండ్ చేస్తారని అనుకుంటారు అందరూ. అయితే ఒక కార్యక్రమంలో వంట చేసినందుకు ఖర్చులు పోను కేవలం 3000 రూపాయలు మాత్రమే వసూలు చేస్తారు వీరు. 20 మందికి మూడు వేలంటే కేవలం 150 రూపాయల కూలీతో కమ్మని విందు బోజనాన్ని వండి పెడతారన్నమాట.

ఇలా ఊరంతా వంటవాళ్లు కావడానికి ఓ కారణం ఉంది. 20వ శతాబ్దం ప్రారంభంలో ఈ ఊరిలో ఒక రెడ్డియార్ కులస్థుల కుటుంబం ఉండేది. ఊరిలో ఉన్న నిమ్నకులస్థులందరూ వారి వద్ద ఏ పని చెప్తే ఆ పని చేసేవాళ్లు. కొందరు వంట పని కూడా చేస్తుండేవారు. వీరు చేసే వంటలు చాలా రుచిగా ఉండడంతో ఇంటికి వచ్చిన అతిథులు వారిని తమ ఇంటికి కూడా పంపమని రెడ్డియార్‌ను కోరేవారు. దాంతో కొన్నిసార్లు వేరే పట్టణాలకు కూడా వెళ్లి వంట చేసి వచ్చేవారు. కొన్నేళ్లకు రెడ్డియార్ దగ్గర పని మానేసిన బలరామన్ తండ్రి, మరికొందరితో కలిసి ఒక బృందంగా ఏర్పడి స్వయంగా వంట చేయడానికి బయటికి వెళ్లి రావడం మొదలుపెట్టారు. దానికి తోడు సరైన వర్షాలు లేక వ్యవసాయం లాభసాటిగా సాగకపోవడంతో ఇంటికొక్కరు వంట వృత్తినే జీవనాధారంగా మార్చుకున్నారు. ఇప్పుడు సంవత్సరంలో దాదాపు ఆరునెలలు ఇంటికి, ఊరికి దూరంగా వంటలు చేస్తూ గడుపుతున్నారు. ముహూర్తాల మధ్య ఉండే దూరమే వీరికి లభించే విశ్రాంతి సమయం. హిందువుల ఆచారాలలో పూజ గదికి ప్రత్యేక స్థానం ఉన్నట్లుగానే వంట గదికి, వంట చేసేవారికి కూడా ప్రత్యేక స్థానం ఉంటుంది. కొందరు మడి కట్టుకొని బ్రాహ్మణులు వండితే తప్ప తినరు. మరికొందరు తమ కులంవాళ్లే వండాలని పట్టుపడతారు. ఇలాంటి అనేక సమస్యలలు ఎదురైనా కలయూర్ వంటవారు అన్ని కులస్థుల ఇళ్లలోనూ వంటలు చేసి అందర్నీ మెప్పించగలిగారు.

"ఒకసారి ఒక రెడ్డియార్ కుటుంబం 100 మంది బ్రాహ్మణులతో నాలుగు వేల మందికి పెళ్లి విందు వండేందుకు ఒప్పందం కుదుర్చుకుంది. అయితే చివరి నిమిషంలో డబ్బు విషయంలో గొడవ వచ్చి ఆ బ్రాహ్మణులంతా వంట చేయకుండానే వెళ్లిపోయారు. అప్పుడు కలయూర్ రెడ్డియార్ మమ్మల్ని పిలిచి వంట చేయమని అడిగాడు. నేను నా 20 మంది బృందంతో కలిసి పెళ్లి తంతు పూర్తయ్యేలోగా భోజనాలను సిద్ధం చేశాం. అంత తక్కువ సమయంలో ఘుమఘుమలాడే విందు సిద్ధం చేసేసరికి రెడ్డియార్ ఆశ్చర్యపోయాడు ఆ రోజు" అని చెప్పాడు బలరామన్.



"మా నాన్న ఏ వంట చేయడంలో అయినా ఘనాపాటి. ముఖ్యంగా అయన చేసిన సాంబారు తింటే లొట్టలు వేయాల్సిందే. ఏ వంటవాడయినా రుచిగా, శుచిగా వండుతున్నాడంటే నిస్సందేహంగా అతను మా నాన్నగారి దగ్గరే వంట నేర్చుకొని ఉంటాడనిపిస్తుంది నాకు" అని చెప్పాడు బలరామన్ కొడుకు ఇలాంగో. "ఒకప్పుడు బ్రాహ్మణుల సంప్రదాయ వంటలను వండేందుకు ఇబ్బంది పడేవాళ్లం. అయితే ఇప్పుడు అన్ని రకాల వంటలను బేషుగ్గా వండేస్తున్నాం. కేవలం భారతీయ వంటలు మాత్రమే కాదు, న్యూడుల్స్, మంచూరియా వంటి చైనీస్ వంటలను కూడా చేసేస్తాం" అని గర్వంగా చెప్పిన బలరామన్ తమ ఇళ్లల్లో మాత్రం స్త్రీలే వంట చేస్తారని, ఆ పని కూడా లేకపోతే వారు సోమరులుగా మారతారంటూ నవ్వాడు. వంట పని లేనప్పుడు వీరు వ్యవసాయం చేస్తారు. ఉన్నప్పుడు ఆడవాళ్లే వ్యవసాయ పనులన్నీ కూడా చూసుకుంటారు.

